శ్రీరస్తు.

శ్రీమదఖండమహీమండల మండనాయమానంబగు

శ్రీభద్రాచలంబున నెలకొన్న,

శ్రీమత్కోదండ రామునికరుణవడసిన

పరమభాగవతశిఖామణియగు

# రామదాసుచరిత్రము

శ్రీహరిభజనశింగరిదాసుగారిచే రచియింపంబడిన

తోహరాతోడ,

అచ్చటచ్చట రామదాసుగారిచే రచియింపంబడిన

కీర్తనలును,

ఆయాకీర్తనలకుముందు సందర్భానుసారముగా,

వచనంబులును,

వెనుక శ్రీరామస్తుతిప్రతిపాదకంబులగు పద్యంబులను జేర్చి

పండితులసహాయమువలన


## పిల్లారిసెట్టి - రాఘవయ్యానాయనివారిచే

గట్టా - ఆదినారాయణశెట్టివారి

ఆదివిద్యావిలాసముద్రాక్షరశాలయందు ముద్రింపించి

ప్రకటింపంబడియె,

1877



## శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీ భద్రాచల మాహాత్మ్యము.

శ్లో॥ శ్రీరామం జనకాత్మజాకుచతటీ శ్రీగంధ పంకోల్లస|......
ద్వక్షోవీధి ముదారమాశ్రితముని ప్రాదుర్భవత్కల్పకమ్|
బ్రహ్మేశానముఖామర స్తుతమజం బ్రహ్మాండభాండాధిపం|
వందేకోసల కన్యకా సుతమహం వారాశిగర్వాపహమ్॥

శ్రీమద్భగవద్భక్తాగ్రగణ్యుండగుభద్రాచలరామదాసుచరిత్రంబునకు మొదల శ్రీబ్రహ్మాండ పురాణస్థగౌతమీ మాహాత్మ్యంబు నందు వివరించిన ప్రకారంబునసంక్షేపరూపంబుగాదెలుపునట్టిభద్రాద్రిక్షేత్ర మాహాత్మ్యంబునకుకథా ప్రారంభంబెట్టిదనిన. సకలపురాణకథాశ్రవణకుతూహలాయత్తచిత్తులగు శౌనకాది మునీంద్రులుపౌరాణికశ్రేష్ఠుండగుసూతునవలోకించియోమహాత్మా సకలసుజనులకుప్రీతికరంబై యుండునట్టియొక్క పుణ్యకథ దెలుపుమనియడిగిననతండాసభికులంజూచి మునీంద్రులారావినుండిభూలోకంబున దండకారణ్యమధ్యంబున గోదావరీ తీరంబున శ్రీరామక్షేత్రంబై జననమరణవ్యాధిబాధాపీడితులగు నరులకమృతపదంబొసగుటకై తారకనాముండగు శ్రీరాముండుసీతాలక్ష్మణసమేతంబుగావెంచేసియుండునట్టి భద్రాచలంబనుపర్వతశ్రేష్ఠంబొకటిగలదదిపుణ్యపదంబునుసేవకనికరాభీష్టదంబునుగాననాక్షేత్రమహిమ ఇట్టిదనియెఱింగి వక్కాణింప బ్రహ్మదేవునికైనశక్యంబు

గాదుపినను నానేర్చుకొలంది దెలిపెదసావధానచిత్తులరై వినుండనిపలికిసూ
తుండు మరలవారల నాలోకించిపూర్వకాలంబునందు సర్వపర్వతంబులకునధి
పతియగు మేరుపర్వతంబు తనభార్యయగు మేరుదేవితోడంగూడిపుత్రార్థియై
బ్రహ్మదేవునుద్దేశించిబహుకాలంబువానగాలియండవలనగలిగెడి శ్రమకునో
ర్చి యత్యుగ్రంబగుతపంబుసలుపుటయునప్పరమేష్ఠియమ్మేరు వానర్చెడితపం
బునకుమెచ్చి ప్రత్యక్షంబై నీకిష్టంబగువరంబుగోరుమిచ్చెదననవుడు నప్పర్వత
శ్రేష్ఠంబా చతుర్ముఖుని ననేకప్రకారంబులం బ్రార్థించి దేవానాకు శ్రీరామ
ధ్యానపరాయణుండగుసుపుత్రుండు గలుగునట్లనుగ్రహించిరక్షింపుమనినం
గరుణించి బ్రహ్మదేవుండవ్వరంబతనికిచ్చి యంతర్ధానంబునొందెను తదనం
తరంబునంగొంతకాలంబునకు మేరువునకు బ్రహ్మనుగ్రహప్రకారంబునమే
రుదేవివలన భద్రుండనుపుత్రుండుపుట్టెనాభద్రుండు రామానుగ్రహంబు
వడసి యాదేవునకు నివాసంబగుటకు మూలకారణంబగు పురాతన కథయొక
టికలదుతత్ప్రకారంబెట్టులనిన-పూర్వకాలంబునందు దశరథకుమారుండైన
శ్రీరామచంద్రుండుతండ్రియాజ్ఞాప్రకారంబునవనవాసంబు సేయంజనిదం
డకారణ్యంబుబ్రవేశించి యయ్యరణ్యంబునందిరుగుచుండుకాలంబుననొక్క
నాడుసీతాలక్ష్మణసమేతుండై పోవుచునొక్కచోట విశాలంబును నతినిర్మలం
బున్నైన నగొప్పశిలంజూచి-మార్గాయాసంబుపోగొట్టుకొనుటకై యాపాషా
ణంబుపయింగూర్చుండియందువలనంగలిగిన సౌఖ్యాతిశయంబున కానందిం
చి యాశిలనుజూచి నీవుమాకిచ్చుటసంప్రాప్తంబైనమార్గాయాసమునుబాపి
తివిగావున నీవీసుకృతవిశేషంబునంజేసి చిరకాలంబునకుమేరుపర్వతంబునకుం
దద్భార్యయగుమేరుదేవివలన బుత్రుండవై జన్మించి శైలరూపధారివై మాక
త్యంత ప్రియభక్తుండవు కాగలవనియానతిచ్చి యథేచ్ఛంజనియె - తర్వాత
నాపాషాణంబు జడస్వరూపంబయ్యును శ్రీరామప్రసాదంబువలనజ్ఞానవం
తంబై కొంతకాలంబునకు మేరుగిరికింగుమారుండై పూర్వజన్మజ్ఞానముగలిగి
తొలిసీతావల్లభుండానతిచ్చిన సువాక్యంబులం దలంచి భక్తపరాధీనుండును
లోకనాయకుండునునగు శ్రీరామదేవుని నత్యంతభయభక్తియుక్తుండై ధ్యా
నింపుచు బహుసహస్రవత్సరంబులు మహత్తరంబగు తపంబుచేసినం దయా
నిధియగు శ్రీమన్నారాయణుండు శ్రీవైకుంఠంబున లక్ష్మీసమేతుండై సనకస
నందనాది నిత్యసూరులుపరివేష్టించికొలువ శేషశాయియైలీలావినోదంబులం

దేలుచుండియు భక్తవత్సలుండుగావున నిజభక్తుండగు భద్రునిం గడతేర్చిర
క్షింపంగోరి శ్రీరామభద్ర రూపంబు ధరించి శ్రీదేవియు నాదిశేషుండును
సీతాలక్ష్మణులై వెంటనంటి రాగా ధనుర్బాణంబులు నమ్ములపొదియును జే
కొని భద్రుండు తపోనిష్ఠుండై యున్నచోటికరిగి యతనితో నీతపంబునకు మె
చ్చితి వరంబులడుగుమిచ్చెదనని యానతిచ్చిన రామచంద్రుని గంభీరవాక్యం
బులువిని భద్రుండు కనులు దెరచి తనకెదుట నీలమేఘచ్ఛాయగల దేహంబుతో
కోటిమన్మథాలంకారుండై నీలమేఘమధ్యంబున తళతళ మెరయునట్టి మెరుపు
పోలికె తనప్రక్క జానకీదేవి నిలువగా స్వర్ణవర్ణ శరీరుండును సర్వభూషణా
లంకారుండునునగు లక్ష్మణుండు ధనుర్బాణంబులు కరంబులంబట్టి తన కట్టెదు
టనిలువ జగన్మోహనుండును రత్నభూషణకిరీటాంగద తారహారాద్యాభర
ణంబులుధరియించి సాక్షాత్కరించిన సీతాపతింజూచి నిజస్వామింగా నెరింగి
భయంబును హర్షంబును మనంబున బెనగొనగనుగొనల నానందబాష్పంబులు
గురియ పులకాంకురితశరీరుండై భద్రుండు రామభద్రునకు సాష్టాంగదండప్ర
ణామంబులుచేసి కరంబులు ముకుళించి స్వామీ శంఖచక్రగదాపద్మశార్ఙ్గా
ద్యాయుధంబులుధరియించి సమస్తలోకంబులకును శుభమునిచ్చుచు దయాపర
మూర్తివై నాబోటిజనులకు మోక్షంబిచ్చి రక్షించుచు ననంతకోటిసూర్యప్రకా
శతేజోనిధివై ప్రకాశింపుచుండెడినీకు నమస్కరించెద నన్ను జడుండనియును
మూఢుండనియును పరిహరింపక ననుగ్రహించి మెచ్చితి వరంబడుగు మిచ్చెదన
నియానతిచ్చితిరి బ్రహ్మరుద్రాది దేవతానాథులకైన నను దొరకని మిమ్ముం గాంచి
మీవలన ననుగ్రహింపబడితిని గావున నాకింతకంటె నెక్కుడు వరంబుకోరుట
కుతోచ లేదు కాబట్టి జానకీలక్ష్మణసమేతంబుగా నాశిరంబున నధివసించి యుం
డునట్టివరంబిచ్చి రక్షింపంగోరుచున్నవాడనని మరియును బ్రార్థించుచున్న భ
ద్రునియందు దయగలవాడై రామచంద్రుండో భద్రుడా నీవుకోరినవరంబిచ్చితి
చంద్రసూర్యులును నక్షత్రంబులును భూమ్యాకాశంబులునుండు పర్యంతంబును
నన్ను మస్తకంబున ధరియించి నాకు సేవ జేయునట్టివారికి సకలసౌఖ్యంబులును
గలుగజేయుచు మిగుల ప్రసిద్ధుండవై పర్వతస్వరూపంబుననుండుము కల్పాం
తంబున నాయనుగ్రహంబువలన నీజడస్వరూపమును విడిచి నిర్మలజ్ఞానసంపన్నుం
డవై మత్పదంబగు వైకుంఠంబు జేరి సుఖింతువు నేడాదిగా నెవ్వరేనియు ప్రీతిపూ
ర్వకంబుగా నిన్నుజూచిరేనియు నన్ను మస్తకంబున ధరియించియుండెడు నీకు భా

సువాళంబున స్నానానుష్ఠానంబులు సలిపి భక్తియుక్తులై మూడుప్రదక్షిణంబులు
చేసిరేనియు నిర్మలజ్ఞానసంపన్నులై మదీయనివాసంబు జేరి సుఖింతురు మరియు
శాస్త్రోక్తప్రకారంబున నాకుప్రియంబగు సీతారామోత్సవంబు సలిపిరేని
యుసిఖుమయుక్తులై యజ్ఞతపోదానాదులొనర్చిరేనియు సంతోషచిత్తులై య
థాతిథిన న్నదానంబు జేసిరేనియునట్టివారు ఆయురారోగ్యైశ్వర్య సంపన్ను
లై యంత్యకాలంబున నన్నుంగాంచి సుఖింతురు-ఇంతియెగాక పూర్వకాలంబు
నందు భగీరథుండు ఆకాశగంగను భూలోకంబునకుగొనివచ్చిన చందంబున గౌ
తమ మహామునీంద్రుండు సహ్యామలయాచల మధ్యంబునందుండి జగత్పావని
యగు గోదావరీనదిం దోడుకొనిరాగలండు గావున నానదినీనికటంబున గౌతమి
యనుపేరం బ్రవహింపుచు నిజసలిలఘాతదేహులగు జనులకు సకలపాపంబులం
బోవునట్లు సేయుచుండుంగావున నానదియె విరజానదియును నేనునివసించియుం
డెడినీశిరఃప్రదేశంబె వైకుంఠంబని దలచి యెవ్వరిందు-వసియించియుండుదురో
వారు పూర్వజన్మంబునం జేసినపాపంబులం బాసి పుత్రపౌత్రాభివృద్ధిగలిగి సమ
స్తసంపదలతో నిహంబున నెల్లభోగంబులు ననుభవించి యంతంబున మత్సాల
యంబగు వైకుంఠంబున నివసింతురు-అని యివ్విధంబున శ్రీరామభద్రుండు భద్రు
నితో నానతిచ్చె తదీయమస్తకంబున నివసించెంగావున నదియాదిగా నీభూలోకం
బునంగలజనంబులకు సేవ్యంబై గలియుగవైకుంఠంబనం బ్రసిద్ధంబై శ్రీరామచం
ద్రతాదాత్మ్యప్రాప్తివిశేషంబువలన భద్రాద్రియనునామధేయంబున శుభస్వ
రూపంబై వెలింగెంగావున నిప్పుడీలోకంబున నెవ్వరేని మేలుగోరునట్టివారు భ
ద్రాచలంబున శ్రీరామనవమినాడు దేవాదిదేవుండై భక్తులకభయంబిచ్చి రక్షిం
చుచుండెడి శ్రీరామదేవుని దర్శించి తులసీదళపుష్పగంధాక్షతంబుల నాదేవుని పా
దారవిందంబులర్చించి రామకీర్తనంబులు పాడుచు నారాత్రి జాగరణంబు సలిపి
రేని శ్రీరామతాదాత్మ్యంబు నొందుదురు నవమినాడుపవసించి మరునాడు పా
రణంబు సేయునప్పుడు బ్రాహ్మణులకు ప్రియపూర్వకంబుగా భోజనంబు బెట్టిరే
ని గంగాతీరంబున కాశీదివ్యక్షేత్రంబున సహస్రబ్రాహ్మణసంతర్పణంబు జేసిన ఫ
లంబునొంది సప్తజన్మంబులం జేసిన స్వర్ణస్తేయ గురుసతీసంగమ బ్రహ్మహత్యా
దిమహాపాతకంబులెల్ల నశించి ముక్తులగుదురు- మరియు నాభద్రాచలంబు చు
ట్టును రెండుకోసులదూరమునకులోపల త్రైలోక్యప్రశస్తంబులగు పుణ్యతీ
ర్థంబులన్నియు శ్రీరామాజ్ఞవలన సన్నిహితంబులై యుండునుగావున నచ్చట

మూడురాత్రులునివసించిన నరులు శాశ్వతసుఖప్రాప్తినొందుదురు. అదియె
ట్టులనిన తొల్లి త్రిలోకసంచారియగు నారదుండు బ్రహ్మదేవునివలననీక్షేత్రమా
హాత్మ్యమునువినియా రాఘవక్షేత్రంబునకువచ్చి గోదావరీతటంబున రామక
థా గానంబు సేయుచు బహుకాలంబు నివసించి పిదప దేవలోకంబునకుం
జనియెను.

కాబట్టియీభద్రాద్రిమహిమంబు సవిస్తరంబుగా వక్కాణింపసహస్ర
దివ్యసంవత్సరంబులైననుజాలవుగాననాశక్తికొలందిని సంక్షేపరూపంబుగా
మీకుందెలిపితినిదిగాకమఱియునొక్కవిశేషంబు గలదువినుండు ఈభద్రశైలం
బునకాగ్నేయభాగంబున రెండుకోసులదూరంబునందుగోదావరీ గర్భంబున
శేషేశ్వరంబనియు సూక్ష్మకుండంబనియునున్నయదివానిమాహాత్మ్యంబెట్టిద
నిన పూర్వకాలమునందుసర్పములకుప్రభువైన శేషుడు నాగలోకమునకుప్ర
భువై యున్నకాలంబునందు క్రూరులగు రాక్షసులుకొందరు రసాతలంబున
కుంబోయియానాగలోకంబునాక్రమించగానారాక్షసులతోబోరాడజాలక
బ్రహ్మలోకంబునకుంబోయిబ్రహ్మతో తనకురాక్షసులవలనగలిగినబోరామినె
రింగించెను అప్పుడాబ్రహ్మదేవుడు శేషునింజూచి నీవుభూలోకంబునకుంజని
భద్రాచలనికటంబునగౌతమీతీరంబునమహేశ్వరధ్యానతత్పరుండవైతపంబు
సలుపుమునీకుంగార్యసిద్ధియగునని పలికిన శేషుండునుం దత్ప్రకారంబునభూ
లోకంబునకువచ్చిగౌతమీతీరంబు జేరియందొక్కప్రదేశంబునశివప్రతిష్ఠగావిం
చి యద్దేవునుద్దేశించి జపతపంబులునియమపూర్వకంబుగాజేయుచు నొక్క
యగ్నిగుండంబునుంగావించి యందభిచారహోమంబుచేసిన భక్తసులభుండ
గుకాలకంఠుండతని నియమకృత్యంబునకుమెచ్చిప్రసన్నుండై సర్వశత్రువినా
శనియును ప్రతిహతంబునునగునొక్కశూలంబొసంగి దీనివలననీకుకీడుసేయు
చుండెడిరాక్షసులంజయించి నిజపదంబేలుకొనుమని యానతిచ్చిన నా నాగేం
ద్రుండుసంతసించియమ్మహాదేవునవేకప్రకారంబులంబ్రస్తుతించియందుండిర
సాతలంబునకుంజని శివదత్తంబగుశూలంబుచేశత్రులనెల్లంబరిమార్చి రాజ్య
సుఖంబులనుభవించుచుస్వజనపోషకుండై యుండె - శేషుండు పాతాళంబున
నుండిభూలోకంబునకువచ్చి గౌతమీనదీతీరంబుననిజాభీష్టసిద్ధినొందెనని యేనా
కాలంబున శేషుండుభూలోకంబుననుండినాగలోకంబునకుంబోయిన బిలద్వా
రంబున భోగవతీజలంబులుబికిగౌతమీనదీప్రవాహంబునంగలసెంగావున. నా

చోటు రసాతలగంగాసంగమంబన ప్రసిద్ధినొందె - నదియాదిగా శేషుని వలన ప్రతిష్ఠింపబడినదగుటవలన నాశివక్షేత్రంబు శేషేశ్వరస్థానంబనియు-నా శేషుండభిచారహోమంబుగావించినకుండంబుమహాగ్ని జ్వాలాసహితమై శమింపక నందలిజలంబుష్ణంబుగనుండుటంజేసి యూష్మకుండంబన విఖ్యాతంబయ్యె నివ్విధంబున శేషేశ్వరుండునునూష్మకుండంబునురసాతలగంగాసంగమంబును శేషునివలనంబ్రవర్తిల్లుటంజేసియాతీర్థంబు శేషతీర్థంబనందనరిసర్వజనమనోభీష్టదాయకంబుగఁ బ్రవర్తిల్లుచుండుగాన మానవు లెవ్వరేనియు నీతీర్థంబునభక్తియుక్తులై స్నానంబును దానంబునుజపంబునుతపంబునుందమశక్తికొలందిగఁజేసిరేనివారలకుముక్తికరతలామలకంబుగనుండునట్లుచేయనోపనివారలుత్రికరణశుద్ధిగలిగి ఈభద్రాద్రిమహిమయును శేషేశ్వరప్రభావంబును రసాతల గంగాసంగమప్రకారంబునువిని యానందించిరేనియు మనంబునం దలచిరేని నిజాభీష్టసిద్ధిగలిగి యంతంబున శ్రీ రామపాదారవింద పరాయణులై వైకుంఠ ప్రాప్తిగలిగి కైవల్యసుఖంబు లనుభవింపగలరని బ్రహ్మాండపురాణోక్తప్రకారంబున సూతుండు శౌనకాది మహామునీంద్రులకుంజెప్పెను.

ఇది శ్రీమద్భద్రాచల మాహాత్మ్యము,

సంపూర్ణము.

శ్రీ ర స్తు.

## రామదాసుగారు.

### భద్రాద్రిరామునికైంకర్యము చేయుటకు కారణము

భద్రాచలసమీపంబుననొక గ్రామంబున తమ్మళదమ్మక్కయనునొక్క భక్తురాలు తనకూతురితోఁగూడ నివసించియుండఁగా శ్రీరామచంద్రుండా దమ్మక్కయొక్క మనశ్శుద్ధి నెఱిగి యొకనాఁటిరాత్రికాలంబున నామె నిద్రించుచుండఁగా నామెస్వప్నంబున కగపడి యో భక్తురాలా నేను భద్రగిరి శిఖరమునందుండెడి శ్రీరాముఁడను నీవు నిక్కముగ భగవద్బ్రాహ్మణభక్తిఁగలిగినదానవు కాబట్టి నాకుఁబూజచేసి నేను పర్వతమునందుండెడు సమాచారమును సమస్తజనులకును తెలియపరచి నాకు మహోత్సవాదులు జరుగునట్లుగాఁజేయుచుంటివేని కొన్నిదినంబులలో నాప్రియభక్తుఁడైన వాఁడొకఁడు గ్రామాధికారియై రాఁగలఁడతండు నాకు కోవెల గోపుర ప్రాకారములుకట్టించును అదివరకున్న బూజింపుచుంటివేని నీకు కైవల్య ప్రాప్తియగునని చెప్పి అంతర్థానమాయెను. అంతటనాదమ్మక్క నిద్రదెలిసి తెల్లవారఁగా తనకొమార్తెను పిలిచి తనస్వప్నవృత్తాంతమును చెప్పి తరువాత వూరిలోనుండెడు జనులకందరికిని తెలియపరచి గ్రామస్థులునుదానును నాఁటిమధ్యాహ్నమునకు భద్రాచల శిఖరమునెక్కి యచ్చటనొక్క ప్రదేశమునందు చెట్లు తీగెలు మొదలైనవాని చేత కప్పబడియుండెడు సీతా రామ లక్ష్మణ విగ్రహములనుచూచి- సంప్రోక్షణాది సమస్తకృత్యములనుజేయించి పూజించి అదియాదిగా నిత్యంబు నా గ్రామాధికారియగు భద్రరెడ్డియనే కాఁపువాని మూలకముగా నివేదితద్రవ్యములను కొంతజనమును కొండనెక్కిపోవునపుడును వచ్చునపుడు సహాయముగానుండుటకొరకు రప్పించుకొని తనశక్తికొలదిని చిన్నమంటపమునుకట్టించి అందులో స్వామిని ప్రతిష్ఠచేసి ఆగ్రామస్థులసహాయమువలన బ్రహ్మోత్సవము మొదలైనవి సేయించుచుండె నిట్లుండగా నెలకొండపల్లి కాఁపురస్థ

డైన గోపన్న జననాదిగా సద్వృత్తియందుండేవాడు కాబట్టి భాగవతోది పురాణకథలు వినునపుడు బ్రహ్మాండ పురాణమునందు గౌతమి మాహాత్మ్యమున భద్రాచలప్రభావంబును విని భద్రాద్రికిం జని శ్రీరాముని సేవించి రామభజనసేయుచు నుండునట్టి భాగ్యంబెన్నటికొనగూడునోయని తలంచుచుండ నొకదినంబున స్వప్నంబున శ్రీరాముండు పూర్వము తమ్మలదమ్మక్కకు ప్రత్యక్షమైనట్టుగానే గోపన్నగారికి ప్రత్యక్షమై నీకు భద్రాద్రి తాలూకా తహాశ్శీలుదారు పని కాగలదు కాబట్టి నీవీక్షణమందే బయలుదేరి గోలకొండ పట్టణమునకుపోయి తానీషాను చూడుమనగా నతడదరిపడిలేచి రాముడుతనకు సాక్షాత్కరించి చెప్పిన వాక్యములను తనమిత్ర బాంధవులతోజెప్పి యాదినమేబయలుదేరి గోలకొండకుపోయి తానీషాగారి వల్ల ఫరవానాతీసుకొని భద్రాద్రికివచ్చి సర్కారుద్రవ్యమునిమనసున నెంచక ద్రవ్యమును వ్రయపఱచి కోవెల గోపుర ప్రాకారాది కైంకర్యములును బ్రాహ్మణసంతర్పణంబులుంజేసి తరువాత వచ్చిన బాధలకునోర్చి రాముని యనుగ్రహంబున పరమపద ప్రాప్తినిపొందిన వాడాయెను.........................*



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

## శ్రీభద్రాచల రామదాసుచరిత్ర ప్రారంభము.

### శ్రీ తా ర క నా మ స్తు తి.

శ్లో॥ శ్రీమద్దివ్య మునీంద్ర చిత్తనిలయం సీతామనోనాయకమ్ । వల్మీకోద్భవవాక్పయోధిశశినం స్మేరాననం చిన్మయమ్ । నిత్యంనీరద నీలకాయమమలంనిర్వాణసంధాయినమ్ । శాంతంనిత్యమనామయం శివకరంశ్రీరామ చంద్రంభజే॥

### శ్రీ మూ ర్తి స్తు తి.

ఉ॥ శ్రీకరలీలఁ బ్రాణులసృజింపఁదలంచివిధాత తానవై। చేకొనివానిఁ బ్రోచునెడ శ్రీవిభుఁడై యవిసంహరింపఁగ । మాకృతిదాల్చిమువ్వురకునవ్వల నాకృతి వెలుంగు సు। ల్లోకుఁబురాణపుణ్యపురుషుఁ బరమాత్మునిభక్తిఁ గొల్చెదన్॥

### శ్రీ శ క్తి స్తు తి.

ఉ॥ శ్రీయసవిష్ణుపేరురము చెన్నువహించి యలంకరించివా । ణీయనినాఁగశంభుమెయిసామునసెక్కొని వాణినాఁగసో। తోయజగర్భునెమ్మొగముదూకొనియేలెడునాదిశక్తిసు । శ్రీయుఁజిరాయువుం సరస సిద్ధకవిత్వము మాకునీవుతన్॥

### వి నా య క స్తు తి.

క॥ ఘనవిశ్వోద్గతికారణ । మనఘుఁడుపురుషుండుబ్రహ్మమాద్యుండువి రం।జనుఁడనుచుఁబ్రాజ్ఞులెవ్వనిఁ।గొనియాడుదురవ్వినాయకునిఁబూజింతున్॥

సౌరాష్ట్రరాగము - అటతాళము.

మూషకవాహన మునిజనవంద్య - దోషరహితదళితాసురబృంద - శేష భూషణ శైలవారధి చంద్ర పోషిత పరిజనప్రశై వ్యకకంద - జయజయ- స్వామిన్ - జయజయ॥ జయజయహితవైరివర్గ ప్రచండ- జయజయజయగజముఖ వక్రతుండ--జయజయ॥ ౧ ॥ అద్రిసుతాసుత అనవద్యచరిత- భద్రభక్తభవ భయహారముదిత- రుద్రోదితబుజుమ స్తకసహిత- సద్రూపసరస జనముదితవినుత-జయ॥ ౨॥ లంబోదరధీరలావణ్యసార- కంబుసుధానిధికర్పూరగౌర సాంబసదాశివ సత్కృపచతుర - సామవేదగీతసకలాధార- జయ ॥ ౩ ॥ శక్రాదిసురగణసన్నుతచరణ- శాతకుంభమణిదివ్యాభరణ- ధిక్కృతసురవిఘ్న తిమిరాపహరణ- ధీరనారాయణతీర్థసుకరణ-జయ॥ ౪ ॥

గీర్వాణాంధ్ర కవిస్తుతి.

సీ॥ సంతతార్చితరామచంద్ర పాదాంభోజు బ్రాచేతసునిగవి ప్రథము దలతు। భారతగ్రంథకల్పనదక్షుభజనంబుసేతునాసత్యవతీతనూజు। శైలరాట్తనయా ప్రసాదవర్ధితవాగ్విలాసు బ్రస్తుతిసేతు గాళిదాసు। పార్వతీవల్లభో పాసనునెమ్మదిబాడుదు వేములవాడభీము। దనకవిత్వంబు నారాయణునకొసంగి। యవ్వియుంభై నశ్రైవల్యమందినట్టి। పుణ్యచరితుని బమ్మెర పోతరాజు। నాత్మగణుతింతుమత్కావ్యములకుకొరకు॥

శ్రీమదాంజనేయ స్తుతి.

మ॥ తనరంగాయనుచేత రామచరణ ద్వంద్వైకదాస్యంబుపొ।చ్చి నభక్తిందగు వాక్కుచేనశఃశ శ్రీరామనామ ప్రకీ। ర్తనముం జిత్తముచేత రామపరతత్త్వధ్యానముంజేయుశ్రీ। హనుమంతుక్ సము ప్రాశ్రయింతుమదభీష్టార్థంబుసిద్ధింపగక్॥

సురటరాగము - ఆదితాళము.

ఆంజనేయునిగొలుతు - శ్రీమ- దాంజనేయునిగొలుతు ॥ లంకలోనున్న సీతాదేవి- శంకమాన్పినట్టి సంజీవరాయని - లంకేశబరిమార్చి రావణాసురుని- లంకగాల్చినట్టి లాంగూలబలుని ॥ ఆంజనే ॥ ౧ ॥ నిండగు భానుమండలమ్మును పండనిపట్టినపరమసాహసుని- మెండగు రావణుమూలబలంబుల- ఖండిచేసినట్టి భీమపరాక్రముని ॥ ఆంజనే ॥ ౨ ॥ దిట్టడై యక్షయకుమారుని- చట్టలుపట్టి చీల్చినబల్లుని- మట్టుబట్టినరావణాసురు-నట్టిట్టు జేసినయంజనీసుతుని॥ఆంజ॥ ౩ ॥

క॥ మది బ్రహ్మాదార్జునసా।రద సనక సనందన శుక పరాశర రుక్మాం।గద భీష్మ శౌనకాదుల । సదయాత్ములభాగవతుల సతతము దలంతున్॥

మానసబోధ,

శా॥ కాండవ్రాతము సల్పఁగానిలుపఁగాఖండింపఁగానేర్చితా।నిండారై యతిశాంతుఁడై సులభుఁడై నీకోరిన ట్లైదయా।భాండాగారమనంగఁ జెన్నగు పరబ్రహ్మంబునౌనన్వయున్।జండించేవుదలంపలేకమనసా సర్వేశుఁ జింతింపవే॥

శా॥ ధీరాగ్రేసర నందనందన హరీ దేవాఘ చూడామణీ। ఘోరాఘాఘ హరా ముకుంద నృహరీ గోవింద శ్రీకృష్ణసం। సారాంభోనిధి కర్ణధారక మలాక్షౌ శౌరి దామోదరా। శ్రీరామాచ్యుత జానకీరమణుఁ సేవింతు నిష్టాప్తికిన్॥

నాటరాగము - జంపె తాళము.

జయజానకీరమణ జయవిభీషణశరణ - జయసరోరుహచరణ జయదీనతరణా॥ హ॥ జయత్రిలోకశరణ్య జయభక్తకారుణ్య - జయగణ్యలావణ్య జయజగద్గణ్యా॥ హ॥ సకలలోకావాస సాకేతపురవాస - అకలంకనిజహాస యబ్జముఖహాసా॥హ॥ శుకమునిప్రనుతపాత్ర శుభరమ్యచారిత్ర - మకరకుండలకర్ణ మేఘసమవర్ణా॥హ॥ కమనీయ కోటీరకౌస్తుభాలంకార - కమలాక్షరఘువీర కమలావిహారా॥ హ॥ సమదరిపుజయధీర సకలగుణగంభీర - అమలహృత్సంచార యఖిలార్తిహరా॥ హ॥ రూపనిర్జితమార రుచిరసద్గుణశూర - భూపదశరథకుమార భూభారహరా ॥ హ॥ పాపసంఘవిదారవర్త్రి ముఖసంహార - శ్రీపతే సుకుమారసీతావిహారా॥ హ॥ జయ॥

చ॥ ఘనులు మహానుభావులు జగన్నుతపుణ్యకథా ప్రవీణవా।గ్వనధులు మీ రెరుంగనినవ వ్రతసంఘము లేను నేర్తునే। ననునొకపెద్దజేసి కృపచేవినఁగోరుట గాదె తాము పెం। చినశుకవాక్యముల్వినఁగ చిత్తము లెల్లఁ దృప్తి నొందవే॥

వ॥ ఇట్లు యిష్టదేవతాభివందనంబును గీర్వాణాంధ్ర కవిస్తుతియునుం జేసి పరమ భాగవత శిఖామణియగు శ్రీరామదాసుచరిత్రంబు వక్కాణింపను పక్రమించెద॥

చ॥ జనవర వింతనీదుగుణసంపద మానుషవేషధారివై। యనయము మోహితాత్ములగ నందరఁ జేయుదు నీవ్యలుండవ। య్యనుజరియింతు వన్నిటను నొప్పియు నొక్కటనుందు వెల్లమా। యనుస్వవశంబొనర్చియుఁ దదాను సరత్వము నర్తువంతయున్॥

నాటరాగము - ఆదితాళము.

నమో స్తుతేరఘునాయకా॥ నమో॥ నమో స్తుతేరఘునాథ పరాత్పర- రమామనోహరరణజయశూర॥ నమో॥ పారావారవిహారగంభీర - పాదోధిశయనపంకజలోచన॥ నమో ॥ ౧ ॥ మందరగిరిధరమహితవిచార - మానితకాసారమణిమయహార ॥ నమో ॥ ౨ ॥ వారణదుఃఖనివారణశుభకర- నాథ సింహాద్రిదాసావనలోలా॥ నమో॥ ౩॥

శా॥ శ్రీరామా రఘునందనా రఘుపతీ సీతామనోనాయకా। కారుణ్యాభయదానహస్తవరదా కాకుత్స్థవంశోద్భవా। దారిద్ర్యాంధతమిస్రతాపహరణాత్యాద్భిచంద్రోదయా। రారా నామదిలో వసించి కృపతో రక్షింపరా మ్రొక్కెదన్॥

సౌరాష్ట్రరాగము - రూపకతాళము.

భజనజేసే విధముదెలియండీ- జనులారమీరు- నిజముగనుగొని మోదమందండీ॥ భజన॥ భజనజేసేవిధముదెలియక- నిజముగాహరిభక్తులనుగొని- మదగజమువలెగ వ్రేయలేకను - సుజనులనితిరుగంగనేలను॥ భజన॥ ౧॥ వారువీరని యెంచబోకండీ- జనులారమీరు- నోరుచచ్చినవారుగాకండీ - వారువీరనియెంచుటెల్లనుసారములేనట్టిహీనత- పౌరుషులకేగాక పుణ్యదారికథలందేమి యున్నది॥ భజన ॥ ౨ ॥ జ్ఞానులనుకొని యెగసిపడకండీ - జనులారతత్త్వ - జ్ఞానమందేమనసునిలపండీ - జ్ఞానులనుకొని యెగసిపడి యజ్ఞానములుపైబెట్టుకొనిన - మానసంబునబుట్టిజచ్చియుఘనానిమిజన్మించవలయును ॥ భజన॥ ౩ ॥ ఝూటమాటలాడబోకండీ - జనులారకపటముగ - నాటకములోజిక్కబోకండీ ఝూటమాటలాడిపాపిష్ఠపూకివేషములుదాల్చక - మాటికీయమబాధలచేగాటికిబోవంగనేటికి॥ భజన ॥ ౪ ॥ మూలస్థానముదెలిసిబ్రతుకండీ - జనులారమీరు - మేలిమిగశ్రీహరినిగనరండీ - మూలస్థానముదెలిసిమీలోచాలగావెలిగేటిజ్యోతిలో- నిలపై వెలుగొందుచాలుని నీలమధ్యమునందుదలచుక॥భజన॥ ధరణిశ్రీనరహరిని గొలువండీ - జనులార మీరు - పరమ పదవిని బొందగోరండీ - ధరను శ్రీఘటికాద్రినరహరి పరమభక్తవరులమనుకొని - విరివిగానరసింహదాసుని - వరకవిత్వముసారమనుకొని॥ భజన॥౬॥

సీ॥ భూలోకమున నొక్క బుధజనాగ్రణికథ జెప్పెదవినరయ్య చెన్నమీర। గోల్కొండపట్టణాంతర్వర్తియైయొప్పి భద్రాచలంబని ప్రబలుచున్న। పురమున తహసీలుపాలుపొందజేసెనుధీరుడై గోపన్నధీసమేతు। డతిభక్తియుక్తుండు నమ్మ

తగుణాఢ్యుండు ప్రేమతో హరిసేవ ప్రబలఁజేసి। పరము జెందెను శ్రీరామభద్రు కరుణ । నట్టిభక్తునిచరితంబు నయముగాను । జెప్పెదను చెవులవినరయ్యా సంభ్రమముగ । బరమభక్తులు సజ్జనుల్ ప్రేమమీర॥.......... ........ ............

## సంధిచరణములు - తోహరా.

సాదనామక్రియ రాగము - ఆదితాళము.

శ్రీకరమగు భద్రాచలమందున వెలగు శ్రీరాములకృపను.
ప్రాకటముగ రామదాసఘనుఁడరిగె బరమపదమునకును॥౧॥
ఇదివినరయ్యా శ్రీహరి గోవిందాయన రయ్యా జనులూ.
సదయుడు శ్రీరామదాసుని కథవిని సద్గతి గనరయ్యా నరులూ॥ఇది॥౨॥

సీ॥ శ్రీకరంబై బుధసేవ్యమై సుజన సాంగత్యమై జన విలోకమగుచు । సీతుస్నైనను గాసిచేసి వాసికినెక్కు [illegible] సింగను లక్షేత భాగ్యమగుచు । మేటిబేరాలబల్పాటవంబున ద్రవ్య ధాటిగల్గు కిరాట కూటమగుచు । స్వకులోచితక్రియాదికము చేజెలువొందు శూద్రసమాజసుభద్రమగుచు । గలితకాసారవనవాటికాయుతంబు । ఫలితనారంగ జంబీరపనసవకుళ । నారికేళాదితరువితానావృతంబు । నగుచుధరనొప్పుగోల్కొండనగరమెలమి॥

రగడ॥ అదిగడునున్నతమయ్యెడికోటలు । సదనంబగునచ్చపుఘూదోటలు। మాణిక్యంబులమయమగు వేదులు। నానేములగుతిన్ననిబహువీథులు। కడునైష్ఠికతలుగలిగిన యాజులు । పుడమినిధర్మము బూనిన రాజులు । ధర్మవినిర్మితబహుసాధంబులు । నిర్మలమణిమందిరయూధంబులు । పచ్చలుగూర్చినబలుతోరణములు । మచ్చికలెసగెడిమదవారణములు । కట్టందములుగగట్టినతేరులు। నెట్టనసాములునేర్చినశూరులు । నవరత్నంబులనయమగుమేడలు। కవగూడినపటికంపులగోడలు పటుతరగేహప్రాసాదంబులు । స్ఫుటతరభేరీపుట నాదంబులు । వేలుపుచేడెలవెలగొను వేశ్యలు। శ్రీలకుబేరునిజెనకెడు వైశ్యులు। నిర్మలబొడవగునిలహెూమంబులు। కమ్మనికృష్ణాగరుధూమంబులు। నిరుపమమాగధనిజగానంబులు। గరిమవహించినఘనయానంబులు। విమలోదకముల వెలసినబావులు । సమచతురములగుచల్లనిశాలలు। మహితబలంబులమనుసామంతులు। బహువిద్యలనేర్పడిధీమంతులు। నీతులుపతులకునేర్పెడిమంత్రులు।ద్యూతాదులకుసదోడగుతంత్రులు। వంగడిబువ్వములమ్మెడిబోటులు। సంగతిగలపిటజనములనీ

[illegible]

క॥ అన్నగరమేలుచుండును । మన్నీలందరును గొలువమదన సురూపుం।
డెన్నటివెరవరినైయా। వెన్నుఁడోకోయనుచుజనులువినుతి యొనర్పన్॥

శా॥ తానీషాయనునామధేయమున నాతారేశబింబోపమం। బౌనెమ్మోము
నుగాంచ నాంకమునుబైపై నీడలందేర్పగా। జానాబేరెదదారహారములు తేజః
ప్రాపశ్రీయంబులై। యానందంబొసగంగసూరిజనమాన్యంబైనసత్కీర్తితోన్॥

క॥ కులమున మ్లేచ్ఛుండైన్నఁగ। నిలనాతనిపుణ్యమెట్టిదో యెరుగుటకున్।
జలజాతాత్మభవాదుల। కలవియె శ్రీరామదేవు గాంచెన్ బ్రీతిన్॥

క॥ ఎన్నఁగదానీషకును। కన్నయమాదన్నయనగ నవనిసురవరుల్। అ
న్నయుదమ్ముఁడుగడుసం। పన్నులు మంత్రులు నీతిపాలితు లరయన్॥

వ॥ వారికి మేనయల్లుండు॥

తో హరా॥ శ్రీమించిన నెలకొండపల్లెలోశిష్టజనులు బొగడగను.
కామాంబకుగోపన్న జనించెను గమలాక్షునివరమున॥ ఇది॥ ౩॥
ఆత్రేయసగోత్రంబు సకంచర్లాంధ్రార్యులవంశంబునను.
పుత్రుఁడగుచు లింగసమంత్రికిదాంబుట్టెను గోపన్నయను॥ ఇది॥ ౪॥

క॥ భూసురవరుఁడగు నాతఁడు। భాసురమగు కంచర్ల కులజభవ్యయశుఁడున్।
వాసర పతివంశజ చర। ణాసక్తుఁడుగోపనయన వర్ణనకెక్కెన్॥

తో హరా॥ పుట్టినపుత్రునిజన్మదినంబున నాసుకులందరు వేగా.
దిట్టముగాగోపన్నయనుచు బహులీలనలొసగిరి బాగా॥ ఇది॥ ౫॥
ఉపనయనంబును నొసరగనుచెను యుక్తకాలమునను.
యుపము గలదుపుత్రునకు నేర్పెయురుశాస్త్రంబులను॥ ఇది॥ ౬॥

గీ॥ శాస్త్రచింతనసేయ చోశాస్త్రవిదులు। బాలరామాయణంబు తాత్పర్య
మెప్ప। దనకు జెప్పినగాని రఘునమనీష। తెల్లదలపోసియుట్లునితల్లడిల్లె॥

వ॥ ఇట్లుదినదినప్రవర్ధమానుండై సైదేళ్లప్రాయంబున పెద్దలుగానుండు
వారికిచోటునగుడి గాపరియాణంబు పారాయణంబుసేయుచువిను వారలకు
తాత్పర్యంబు దెలుపుచుండెనీబాలుండు రామాయణంబామూలాగ్రముగవినిన
వారైనేనారాములతోడ. గూడజననమొందకపోతినిగదా. అటులజననమొం
దియుంటినేనిసుగ్రీవాదివానరులంగూడి శ్రీరాములకు సేవసేయుదుగదా అనిత
నయభిప్రాయమును గీర్తనచేయుచున్నారు॥

ఆనందభైరవిరాగము - ఏకతాళము.

ఆశపుట్టెనే - శ్రీరాములతో - హాహానేపుట్టనైతిని- రఘురాములతో

అయ్యోనేపుట్టనైతినీ॥ శ్రీరాములతో బుట్టి సేవలు సేయనైతినీ ॥ శ్రీ॥ దశరథ నందనులై - దాశరథిరాములు- వశముగబాలురతో - వరదుడై యాడంగ- వన జనాభునకుదాసుడనై నే- భయభక్తిప్రేమతోడ- శ్రీరామరామ- సకలసేవ లుసల్పుచుమురియుచు- అకటునల్గురితో- నాడుకుందుగద. అయోధ్యాపురిలో గజమునెక్కి- అచ్యుతుడురాగాను- నాట్యమాడుచు- నన్నురక్షించుమందును. విశ్వామిత్రునివెంటబోగానేబోదును - జనకుడుహరికి- జానకినిపెండ్లిసేయం గా- వారిద్దరికినెత్తిబియ్యమునేదెత్తును- అమ్మకుహరికి- ఆకులుమడిచియిత్తును- నరులారయితడే నారాయణుడని నేజాటుదును-మనలనురక్షించే-మాధవుడు వచ్చెనందును- మనగతియేమందు- ప్రభుదశరథు నేబతిమాలుదుగద - కైకే యినినేగాదనందుగద- రాముల్కి నారాజ్యమిత్తుగద - ప్రభునై యేలగవను లుచేతుగద - అడవికిపోగానంటిపోదుగద - గుహునితో గూడుకకూడిమురుతు గద- నిలిచిదానవులనెత్తిగోడుదుగద- ఖరయుద్ధంబునగాగిలింతుగద॥ఆశ॥౧॥ కనకమృగమురాగా గాంతదెమ్మంటే- వోనెచ్చెలులార అయ్యోపోతిర- ఆమృ గమునుదెచ్చెమ్మకిత్తుగద- హరినినేనుపోవద్దనందుగద - ఆమృగమువెంట గా ముఖుడంతట - తపోవేషమున- శశిముఖితనశౌర్యము జూపంగ- జానకివణుకం గ- ఆరావణుడుసీతమ్మను చరబట్టంగ- అప్పుడునేనుంటే - అమ్మకుభయము దెల్పుదును- ఆశ్రీపాదములుఅట్టెపట్టుకనేమ్రొక్కుదును - హరిదుఃఖింపగ అమ్మజాడనేదెత్తును- సర్వజ్ఞమూర్తిచాలుసీవిరహమందును - విశ్వములోనం దరువిననట్టెయూరకుండిరి - సురవరులందరుముఖముఖముచూచుచుండిరి- అ య్యోయిదియేమని- ఆబ్రహ్మాదులశపయింతునుగద - విక్రమవంతులనేమిచేతు నేనెవ్వారివేడుదు - ఏమరియుండిరి యా ఋషులందరు - ఏలపోయెనుయాజ్ఞ వాల్కికి- యేలదశరథుడుయజ్ఞముచేసెను - యెందుకుబుట్టిరియీలోకమునను- యెందుకువచ్చిరియీవనమునకును- యిట్టివరములియేలవేడిరి-యెక్కడదోచ దుయింతటిజాలి॥ఆశ॥౨॥ పంపాతీరమునశబరిమాల్చి కబంధుని - యింపుగశబ రివిందులుయిష్టముతోజేసీ - యింద్రతనయుసూనునిహితవుగావించి- ఆంజనే యఅంగదముఖ్యాదులు- మంజులవాణిసేమరువకవెతుకగ- వారలతో గూడి వె దుకుదుగద- వైదేహినిప్రేమతోను- సహాయముగరమ్మి- సంపాతిపోకుమం దును- సముద్రమునే - చాకళించివేగ దుముకుదును - లంకగాలించి పంకజా [illegible]

హరికి నే విన్నవింతును- జానకీరామ జాగేల లేలెమ్మందును. అపరాధిని నేనని- హరికి వాహనము. ఆంజనేయులట. ఆలక్ష్మణునకు- అంగదరాజట - ప్రభురాములనే ప్రార్థింతునుగద- సేనలగూడుక చెల్లాడుదుగద- కపులతో వారధిగట్టివేతుగద- సముద్రుడాయిదిసమయమందుగద - హరి సేనలపనులాచరింతుగద. బలిముఖులకుగలబలముజూతుగద- శుభరాములతో సొంపుగందుగద॥ ఆశ॥ ౩॥

లక్ష్మణాగ్రజుడు సేనారావించి- లక్ష్మికొరకు కపులులంకజుట్టంగ- రక్షించె భద్రాద్రి రామదాసుడనై- రణములో రావణుని ద్రుంతును- ఆక్షణమున రఘువరునప్పుడె నేబిలుతును- మంగళపతివ్రతనుమాధవుకర్పించిమురుతును-అవ్వావంతుకు అగ్నిలో నేజొత్తును. ఆపుష్పకమెక్కి- హరితో అయోధ్యకుబోదును-భరతులానందభరితులై వేడుకొనంగ-ఘోరునవాద్యములుభువనములేనిండ మ్రోయంగ- పట్టాభిషేకముపరమఋషులు సేవింపంగ- జయములుపాడంగ- రాముతొడలపై లక్ష్మియుండంగ- లక్ష్మణానుజులురమణవిసరగా-వాయుసుతుడుపదవనజములొత్తగ- చేరివిభీషణుడాహాయనగా. అధికపులుహరిగోవిందనగా. బ్రహ్మదులుహరిబ్రస్తుతింపగా- తల్లి మారుతికిదండవెయ్యగా-నాతల్లి ప్పుడున్నాకువేసుగద- కష్టపడితిననికరుణించునుగద- సీతారాములు సిరులిత్తురుగద॥ ఆశ॥ ౪॥

గీ॥ ఇవ్విధంబునదలచుచునింటి రేశు। పైనిగలిగినబాళితో బాలుడయ్యు
సర్వశాస్త్రార్థ సారవిస్తారమెల్ల। నేర్చి సంతోషజలనిధి దేల్చెజనకు॥

తోహరా॥ ఈగతిజననీజనకులు పుత్రునిసీతిమంతునిగ జేసీ.
వేగమె శ్రీహరినిలయము జెందిరి వేరుజన్మములువాసీ॥ ౭॥
బాల్యమందు శ్రీరామనామమును భజియించుచు దానుండెక్.
శ్రీలక్ష్మీశునిచరణకమలముల చింతయనుఫలము పండెక్॥ ఇది॥ ౮॥

నవరోజురాగము - అటతాళము.

భజరేమానసరామం. భజ- భజరేజగదభిరామం॥ భజ॥ కరధృతకరకోదండం- కరితుండాయతభుజదండం॥ భజ॥ దాశరథేనరసింహం॥ భజ॥ దాశరథేసురసింహం॥ భజ॥ కౌసల్యాబహుభాగ్యం॥ భజ॥ మైథిల్యాలోచనయోగ్యం॥ భజ॥ అవనతజలజభవేంద్రం॥ భజ॥ అగణితగుణగణసాంద్రం॥ భజ॥ మాయామానవదేహం- మునిమానసరుచికరగేహం॥ భజ॥ రూపమదనశతకోటిం-నత-భూపమదనశతకోటిం॥ భజ॥ శ్యామజలధరశ్యామం॥ భజ॥ సాంబశివాత్రుతికామం॥ భజ॥ భద్రాచలనిధివాసం- పరి- పాలిత శ్రీరామదాసం॥ భజరే॥

ఆనందభైరవిరాగము- చాపుతాళము.

రామనామమేజీవనము- అన్య-మేమిరామకృపావనమూ॥ రామనామసు
ధామధురమమది-నేమరక భుజియించుమాకిక॥ రామ॥ శ్రీలమేలుభయానక
మో- రఘు-వీరులీలలేపానకమూ-బాలుమీగడజారుతేనెయు-పాలకన్నమేలి
మైనది॥ రామ॥ ౧॥ ఈరసములెల్ల నీరసము- రఘు- వీరుకథలెల్ల పాయసమూ-
సారెమాకు చేకూడెనాకలి- దీరెద్రృష్ణచల్లారెనాభళి॥ రామ॥ ౨॥ ఘోరభవసిం
ధుతారకము- హృద-యారివర్గనివారకము- సారమాఘనసారకదళీఫ- లోరు
సౌఖ్యమపారసారము॥ రామ॥ ౩॥ సుందర శ్రీరాజములు - రఘు-నందనాం
ఘ్రిసరోజములు- చెంది బ్రహ్మానందభావము- నందిముక్తినింపొందజేసిన॥ రా
మ॥ ౪॥ భాసమానశుభాకరము- నిజ-దాసలోకవశీకరము - భూసుతాహి
తుడై భద్రాచల- వాసుడై రామదాసునేలిన॥ రామ॥ ౫॥

తోహరా॥ గృహపతిధర్మమునేఅపుచుగోపనగృహమందునతానుండక్-
విహగవాహనునిదాసుండొక్కడువీరిగృహ్యామునందక్॥ఇది॥౯॥
పంచబాణునిజనకునిబాడుచు నంచితమతితానుండక్-
వంచనలేనిమహాత్ముడీతడని యెంచిచెంతనిలుచుండక్॥ఇది॥౧౦॥
గోపనముఖమైపై లక్షణములగడుగురుతిడిదాసుడుచూచెక్-
ఓప ననకునేనొక్కటిజెప్పెదనోడకుమనిచేచూపెక్॥ఇది॥ ౧౧॥

వ॥ చేతులుచూపి గోపన్ననుబిలిచియతనియందు భగవద్భక్తలక్షణంబు
లుండుటగాంచి నీయందుశాంత్యాదిగుణంబులున్నయవి నీకు నఖండయోగం
బును శ్రీరామచంద్రానుగ్రహంబును గలుగు నేదెల్పునది యానిప్పూనివిను
మని యిట్లనియె॥

శ్లో॥ శ్రీరామరామరామేతి రమేరామేమనోరమే।
సహస్రనామతత్తుల్యం రామనామవరాననే॥

వ॥ ఈప్రకారముగా కబీరుదాసుగారు గోపన్నకు రామనామమును
వఠించుచునుండుమని రామమంత్రంబుచెప్పి యథేచ్ఛంజనువారైరి॥

తోహరా॥ సామగానలోలాయనిసొక్కుచు సరగ కబీరుడుజనెనూ-
వేమారునుగోపన్నయుండెను వేదవేద్యుబాడుచునూ॥ ఇది॥౧౨॥
కబీరుదాసులకటాక్షమునతాగాంచె రామనామమునూ-
జపంబుసేయుచుజలజనయనుని చరణసేవనేమమునూ॥ ఇది॥౧౩॥

వ॥ గోపన్న కబీరుదాసు సన్నిధిని రామమంత్ర ప్రభావంబు విని యా నందించుట యెటువలెనన॥

శ్లో॥ జయతుజయతుమంత్రం జన్మ సాఫల్యమంత్రమ్। జననమరణభేదక్లేశవిచ్ఛేదమంత్రమ్। సకలనిగమమంత్రం సర్వశాస్త్రైకమంత్రమ్। రఘుపతి నిజమంత్రం రామరామేతిమంత్రమ్। నిఖిలనిలయమంత్రం నిత్యతత్త్వాఖ్యమంత్రమ్। భవకులహరమంత్రం భూమిజా ప్రాణమంత్రమ్। పవనజనుత మంత్రం పార్వతీమోక్షమంత్రమ్। పశుపతినిజమంత్రం పాతుమాం రామమంత్రమ్॥ ప్రణవనిలయమంత్రం ప్రాణనిర్వాణ మంత్రమ్। ప్రకృతి పురుష మంత్రం బ్రహ్మరుద్రేంద్ర మంత్రమ్। ప్రకటదురిత రాగద్వేష నిర్నాశ మంత్రమ్। రఘుపతినిజమంత్రం రామరామేతిమంత్రమ్॥ సంసారసాగరభ యాపహవిశ్వమంత్రమ్। సాక్షాన్ముముక్షుజనసేవితసిద్ధమంత్రం। సారంగ హస్తముఖహస్తనివాసమంత్రం। కైవల్యమంత్రమనిశంభజ రామమంత్రం॥

ధన్యాసి రాగము - ఆదితాళము-

తారకమంత్రముకోరినదొరికెనుధన్యుడనైతిని - ఓరన్నా - మీరినకాలుని దూతలపాలిటిమృత్యువయనినమ్మికయున్న ॥ తారక॥ మచ్చికతోయితరాం తరంబులమాయలలోబడబోకన్నా - హెచ్చుగనూటయెనిమిదితిరుపతులెలమితి రుగపనిలేదన్నా - ముచ్చటగాయాపుణ్యనదులలోమునుగుటపనియేమిటికన్నా - వచ్చెడిపర్వపుదినములలోసుడివడిపడుటయుమానుకయున్నా॥ తారక॥ ౧॥ ఎన్నిజన్మములనెంచిచూచినను యేకోనారాయణుడన్నా - అన్నిరూపులైయున్న పరాత్మునిఆమహాత్మునికథవిన్నా - ఎన్నిజన్మములజేసినపాపముయీజన్మముతోవిడునన్నా - అన్నిటికిదికడసారిజన్మము సత్యము యికపుట్టుటసున్నా॥ తా ౨॥ నిర్మలఅంతర్లక్ష్యభావమునిత్యానందముతోనున్నా కర్మంబులువిడి మోక్షసద్గతినికన్నులజూచుచునున్నా ధర్మముతప్పకభద్రాద్రీశునితనమదిలోనమ్మికయున్నా. మర్మముదెలిసినరామదాసునిమందిరమునకేగుచునున్నా॥ తారక॥

తోహరా॥ సామజవరదునినామముదలచుచు సర్వముమిథ్యనిదలచెక్ -
కామాదికషడ్వర్గములెల్లనుకడువడిద్రోచటునిలిచెక్॥ ఇది॥ ౧౮॥

ధన్యాసిరాగము - ఆదితాళము.

శ్రీరామనామమేజిహ్వకుస్థిరమైయున్నాదీ - శ్రీరామునికరుణలక్ష్మీకరమై యున్నాదీ॥ ప॥ ఘోరమైనపాతకములగొట్టినన్నాదీ - మమ్ముచేరకుండఆపదలా ఛెండేమన్నాదీ॥ శ్రీ॥ ౧॥ దారితెలియని యమదూతలనుదరిమేనన్నాదీ - శ్రీమ

న్నారాయణునిదాసులకునద్వైరి యున్నాది॥ శ్రీ॥ ౨॥ మాయావాదులతోపొం దుమానుమన్నాదీ-యీకాయములస్థిరమనితలపోయుమన్నాదీ॥ శ్రీ॥ ౩॥ పా యకగురురాయనిబోధబాయకన్నాదీ- యేమేడజూచినగాని తన్నేడబాయ కన్నాదీ॥ శ్రీ॥ ౪॥ కామక్రోధలోభాకారములమానుమన్నాదీ-మదముతోప రస్త్రీలపొందు మోసమన్నాదీ॥ శ్రీ ॥ ౫॥ వదలానిదుర్విషయవాంఛవిడువుమ న్నాదీ-నామదిలోహరిభజనసంపత్కరమైయున్నాదీ॥ శ్రీ॥౬॥కోపమనియేటి ప్రకృతికొట్టుమన్నాదీ యిపుడు ప్రాపునీవేయనినదారిజూపెమన్నాదీ॥ శ్రీ॥౭ యేపుమీరయొరుల దోషమెన్నకన్నాదీ - ఈప్రాపబంధమూల పట్టుబడవద్ద న్నాదీ॥ శ్రీ ॥ ౮ ॥ భక్తిభావనదలిసిమీరు బ్రతుకుమన్నాదీ - పరమభక్తులసే వజేయుచు ప్రబలుచున్నాదీ॥ శ్రీ ॥ ౯ ॥ ముక్తిమార్గమున కిదిమూలమన్నాదీ- విరక్తిగభద్రాచలరామదాసుడన్నాదీ॥ శ్రీరామ॥౧౦॥

తోహరా॥ దేహపోషణకు నుపయుక్తంబుగ దేవిని తావరియించెన్-
సహజముగాచక్కనిసుతునొక్కనిసద్గతికై తాగాంచెన్॥ ఇది॥ ౧౫॥
ఉదరపూరణార్థంబునకును దానుంఛవృత్తియోచించెన్-
ముదమున శ్రీహరిదాసులగూడుక మోదమలరవర్తించెన్॥ ఇది॥ ౧౬॥
ద్రవ్యమంతటికి దానధర్మముల దారిజూపెగోపన్నా-
అవ్యయాత్ముడగు శ్రీరాములపదమందదలచెబుధులెన్నా॥ ఇది॥ ౧౭॥
పట్టువదలితనధనమంతయు వ్యయపరచినిశ్చలుండై-
కట్టువస్త్రములతోనిలబడెనుకమలాపతిదాసుండై॥ ఇది॥ ౧౮॥
కన్నవారలాఘనునిలేమిగనికన్నులనీరిడుచుండన్-
వన్నెదరిగియునుమన్ననతోరామన్ననుగొలుచుచునుండన్॥ ఇది॥ ౧౯॥
ఇటువలెనొకయేటిడుములుపొందగదటుకుననొకతలపొదవెన్-
యేటకేనియుజనిరామోత్సవమునకేర్చి తెత్తుధనమొదవన్॥ ఇది॥ ౨౦॥

నాదనామక్రియరాగము - చాపుతాళము.

శ్రీరామనామాంమరువాంమరువాం-సిద్ధముయమునికివెరువాంవెరువాం శ్రీ॥౧॥ గోవిందునేవేళగొలుతాంగొలుతాం- దేవునిగుణములుదలుతాందలు తాం॥ శ్రీ॥ ౨॥ విష్ణుకథలుచెవులవిందాంవిందాం- వేరేకథలుచెవుల మందాం మందాం॥ శ్రీ॥ ౩॥ రామదాసులుమాకుసారాంసారాం- కామదాసులుమా కుదూరాందూరాం॥ శ్రీ॥ ౪॥ నారాయణునిమేమునమ్మేంనమ్మేం- నరులనుయి క మేమునమ్మాంనమ్మాం॥ శ్రీ॥ ౫॥ మాధవ నామము మరువాంమరువాం- మరి

యమబాధకు వెరువాం వెరువాం॥ శ్రీ ॥ ౬ ॥ అవనిజపతిసేవ మానాం మా
నాం- మరిమొకజోలంబేటికి మానాం మానాం॥ శ్రీ ॥ ౭ ॥ భద్రగిరీశునికండాం
కండాం- భద్రముతో మనముండాం ఉండాం॥ శ్రీరామ ॥ ౮ ॥

తోహరా॥ పదవుబాదులో మేనమామలు అక్కన మాదనగారూ.
సదయులు తానిషవద్ద మంత్రులై సౌఖ్యముతో నున్నారూ॥ఇది॥౨౧॥
అని యోచించి తానై దరబారుకు అరిగెను మెన్నికతోనూ.
అనయము వారలవలన బాదుషా అధిపునిసముఖమునకు నేనూ॥ఇది॥౨౨॥
చూచి తానీషను సింహాసనమునచూచు కల్కేంపోదవక.
దాచెను చంగులు చుట్టి క్షణమున దనవినయము దెలియక॥ఇది॥౨౩॥
చూపు మేరలో మండి వేసుక సుభగచరితుడపుడూ.
యేపున నమగు సలాములు చేయుచు నీగతి భూసురుడూ॥ఇది॥౨౪॥
భయభక్తులతో రత్నాంచితమగు పాదుషత త్తును జూచీ.
రయము మొప్పతి వాసీముగ్గిడిరై తుహలోనె త్నానిలిచీ॥ ఇది॥౨౫॥
తానీషనుగను గొనినోపన్న యు తా చతురత భాషింపా.
[illegible] లేదో చియ్యాత [illegible] ఇది॥౨౬॥

నైజ సభాశుభాసనమునం దాసీనుండై మానిస। ద్భృందాసాధిపలక్ష్మణా
న్వితుడునై పృథ్వీసుతాయుక్తుండై। కుందేందీవరవర్ణుండౌ రఘువరుం గంజ
త్కు సేవించెదక॥

నాదనామక్రియరాగము. ఏకతాళము.

కోదండరామ కోదండరామ - కోదండరామ కోదండరామ॥
నీదండనాకు నీవెందుబోకు - వాదేలనీకు వద్దుపరాకు॥ కో॥
శ్రీరామమమ్మూ చేపట్టుకొమ్ము - ఆదుకోరమ్ము ఆరోగ్యమివ్వు॥కో॥
జయరఘువీర జగదేకశూర - భయద నివారభక్తమందార॥కో॥
మణిమయభూషమంజులభాష - రణవిజయఘోషరమణీయవేష॥కో॥
ఏలరావయ్యా యేమంటినయ్యా - పాలించవయ్యా ప్రార్థిగనవయ్యా॥కో॥
తల్లి వినీవె తండ్రి వినీవె - దాతయు నీవె దైవము నీవె॥కో॥
అద్భుతకుండలామలగండ - సద్భుతదండ సమర ప్రచండ॥కో॥
సరసిజనేత్ర సౌందర్యగాత్ర - పరమపవిత్ర భవ్యచరిత్ర॥కో॥
ఏబుద్ధిపీడు మెరుగనివాడు - పాపడు పీడబడలియున్నాడు॥ కో॥
పాపనులేపి ప్రజలనుగల్పి - యాపదబాపియటు ప్రీతిజూపి॥ కో॥

భద్రగిరినిదూరంబునందుండి గాంచి గోపుర ప్రాకారమంటపాదులను వర్ణించుచున్నారు॥

వరాళిరాగము - ఆదితాళము.

అదుగో భద్రాద్రి గౌతమియిదిగో జూడండి ॥ ముదముతో సీతా ముదితల క్ష్మణులు - కదిసికొలువగా రఘుపతియుండెడి॥ దదు ॥ ౧ ॥ చారుస్వర్ణప్రాకా గోపుర - ద్వారములను సుందరమైయుండెడి॥దదు॥౨॥అనుపమానమైయతి సుందరమై- దనరుచక్రమునథగధగ మెరసెడి॥దదు ॥ ౩ ॥ కలియుగమందున వైకుంఠము - నలరుచునున్న దినయముగ మ్రొక్కుడి॥అదు॥౪॥పొన్నలపొగ లపూపొదరిండ్లను-చెన్నుమీరగను శృంగారంబగు॥నదు ॥ ౫ ॥ శ్రీకరముగనిల రామదాసుని- ప్రాకటముగ బ్రోచే ప్రభువునివాసము॥అదుగో॥౬॥

వ ॥ ఈప్రకారముగా కోవెలగోపురప్రాకారముల వైభవంబుచూచుచు భద్రాచలంబుచేరిగౌతమీనదిం గాంచి సేవకులుందానునుస్నానంబుచేసిసీతా రామలక్ష్మణుల సేవించియానందంబునొంది భద్రగిరిండిగ్గితహశీలుకచ్చేరి ప్రవేశించికాపురంబిలిపించియిట్లనియె॥

లక్ష్మణస్వామి. శ్రీ రామస్వామి. శ్రీ సీతాదేవి.



ఎవరుమీతోటివారెవరుమీపాటి- రాతుమీసాటిరాజులమేటి॥కో॥ ౧౨
దశరథబాలదాసానుకూల - దశముఖకాలధరణీశపాల॥కో॥ ౧౩
మారుతభీమమహాల్యాభిరామ- కల్యాణనామకారుణ్యధామ॥కో॥ ౧౪
మంజులభాషమణిమయభూష- కుంజరపోషకువలయవేష॥కో॥ ౧౫
పుట్టించనీవెపోషించనీవె- ఫలమియ్యనీవెభాగ్యమునీవె॥కో॥ ౧౬
శరణన్నచోటతుమసేయుమాట-బిరుదునీదాటమెరిగున్నమాట॥కో॥
రావయ్యనీకిరక్షించుగాని - సేవజేసెదసుతుడగునుగాని॥కో॥ ౧౮
మురళీవిలోలమునిజనపాల- తులసీవనమాలతుంబురులోల॥కో॥ ౧౯
రావణభంగరమణీయశాంగ- పావనలింగపాదాబ్జభృంగ॥కో॥ ౨౦
మందరహారమన్మథాకార- సుందరోద్గారముక్తికహార॥కో॥ ౨౧
వందనమయ్యావాదేలనయ్యా- దండనజెయ్యతగదుమీకయ్యా॥కో॥ ౨౨
లాలితహాసలక్ష్మీవిలాస- పాలితదాసభద్రాద్రివాస॥కో॥ ౨౩
శ్రీవిజయరామశ్రీతులసిదామ-పావననామభద్రాద్రిరామ॥కో॥ ౨౪

వ॥ ఇవ్విధంబునరామచంద్రుం బేర్కొని స్తుతించుతరి నచ్చాలుండు రామప్రసాదంబునని ద్రించువాడుమేల్కొన్నతెఱంగునఖునర్జీవితుండై నం చిపరమానందంబునొంది శ్రీరామభజనంబుసేయుచు॥

హా ॥ ఇటువిహరింపుచుయింపుతోనుండెనయలభద్రాచలమునను.
అటు తర్వాతార్లతులవరహాలమరెఖజానాలోను॥ ఇది॥ ౩౭
అప్పుడుశ్రీభద్రాచలరాములహర్షముతోసేవించెర్.
ముప్పిరిగొనిశ్రీపాదపద్మములుముదమలరగ ధ్యానించెర్॥ఇది॥ ౩౮

రేగుప్తిరాగము - రూపకతాళము.

వందేవిష్ణుందేవమశేషస్థితిహేతుంత్వామధ్యాత్మజ్ఞానిభిరంతర్హృదిభా వ్యమ్। హేయాహేయద్వంద్వవిహీనంపరమేకంసత్తామాత్రంసర్వహృదిస్థం దృశిరూపమ్॥వందే॥ ౧ ॥ ప్రాణాపానౌనిశ్చయబుద్ధ్యాహృదిరుద్ధ్వాభిత్వా సర్వంసంశయబంధం విషయౌఘాన్ । పశ్యంతీశయంగత మోహాయతయ స్తంవందేరామంరత్నకిరీటంరవిభాసం॥వందే॥ ౨ ॥మాయాతీతంమాధవమా ద్యంజగదీడ్యంనిత్యానందంమోహవినాశంమునివంద్యం। యోగిధ్యేయంయో గవిధానంపరిపూర్ణంవందేరామంరంజితలోకంరమణీయం॥వందే॥ ౩॥భావా

త్వాంశుద్ధంబుద్ధమనంతం ప్రణవాఖ్యం వందేరామం వీరమశేషాసురదావం॥ ౪॥ త్వంమేనాథోనాధితకార్యాఖిలకారీమానాతీతోమాధవరూపోఖిలధారీ। భక్త్యాగమ్యోభావితరూపోభవహారీయోగాభ్యాసైర్భావితచేతస్సహభావీ॥వందే॥ ౫॥ త్వామాద్యంతంలోకతతీనాంపరమీశంలోకాతీతంలౌకికమానైరధిగమ్యం। భక్తిశ్రద్ధాభావసమేతైర్భజనీయం వందేరామంసుందరమిందీవరనీలం॥ వందే॥ ౬॥ కోవాజ్ఞాతుంత్వామతిమానంగతమానం మానాసక్తోమాధవశక్తోమునిమాద్యం। బృందారణ్యేవందితబృందారకబృందం వందేరామంభవముఖవంద్యంసుఖకందం॥ వందే॥ ౭॥ నానాశాస్త్రైర్వేదకదంబైప్రతిపాద్యంనిత్యానందంనిర్విషయజ్ఞానమనాదిం। మత్సేవార్థం మానుషభావం ప్రతిపన్నంవందేరామంమరకతవర్ణంమథురేశం॥౮॥

తోహరా॥ జగదీశునియిట్లభినుతించితనజన్మసాఫల్యముగాంచెక్.
తగునీసన్నిధిజీర్ణోద్ధారణతాజేసెదననితలచెక్॥ఇది॥ ౩౯
ఒక్కదినంబున దనగృహంబునకునాదరగకాపులబిలిచీ.
వెక్కసుడకనువినుడుకైవ్వెదనుసేరుగదలపగనిలిచీ॥ఇది॥ ౪౦
ఎన్నిదినంబులు బ్రతికినమరణమునున్నయగుటలేదూ.
వన్నగశ్రీహరిపదములగొలిచినపన్ననటుగాదు॥ఇది॥ ౪౧
చేయదలచితినిరామునికోవెలజీర్ణోద్ధారణమేనూ.
పాయకమీరలు ప్రక్కబలముగా ప్రబలుడుకార్యములోనూ॥ ఇది॥ ౪౨
అనవినికాపులుహర్షమునొందుచు హరిభక్తునకిట్లనిరీ.
మనవి వినుడుమీమర్జిచొప్పునమనగదలతుమనిరీ॥ ఇది॥ ౪౩
ఆమాటలువినియానందంబున నప్పుడెశిల్పులబిలిచెక్.
కామాటలుగానికడువేగంబునకార్యముప్రారంభించెక్॥ ఇది॥ ౪౪
రాముచామతానీషద్రవ్యమీరాత్రినిల్వయార్లతుల్.
భీమవినుతనీకైవ్యయపరచినస్వామికందునేశిక్షల్॥ఇది॥ ౪౫॥
దేహమునిత్యంబనితానెంచకధీరతగానూహించెక్.
సాహసమునతానీషపైకమునుసరగునతావ్యయపరచెక్॥ ఇది॥ ౪౬
వ॥ మరణకాలంబుననొకటియుతనవెంటరాదుగానజీవితకాలమందేభగవత్కైంకర్యములజేయవలయునని రామదాసుగారుతలంచుచున్నారు॥

### నాదనామక్రియరాగము. ఆదితాళము.

పోవ్వేటప్పుడు వెంటరాదు పాకవుచ్చినవక్రైన- వెయ్యారులుదాచుకు నేరర్థులకియ్యలేనిలోభులకయ్యయ్యో॥పో॥ఇచ్చినమాత్రముయిచ్చునుదైవము యెచ్చడిగినరాదు-వచ్చేటప్పుడు వెంటనేమైన తెచ్చుకశాలేదు- హెచ్చుగలుగు తెలియనిపామరులుదురాశలోతగులుకొని- యిచ్చటసార్జించినధనమెచ్చటి కెత్తుకపోవ్వేరయ్యో॥పో॥తనురక్షణకై మూలమూలలనుధనములుదాచేరు. తనువులుమలభాండములస్థిరమనితలచికానలేరు- తలతురుదారలు పశుసుతా దులుతమవనిభ్రమసేరు-తనవారెక్కడతానెక్కడనోతనువువిడిచియీజీవుడు పోంటిగ॥పో॥ఇరవుగతొలిజన్మంబునపేదలకియ్యనిదోషముల - తిరిపమువెత్తే వారుదలంచుటదెలిసితెలియలేక- పరులకుబలిభిక్షములుపెట్టనిపరమలోభులిల్లు మా-ధరలోవేంకటవిఠలునిదలచక ధనమదాంధనమునదగిలియీజీవుడు॥ పో॥

వ॥ ఈప్రకారముగాతలచిగోపన్నగారు యేమిసేయుచున్నారనిన-

### కల్యాణిరాగము- ఆదితాళము.

కైంకర్యముచేసెను- రామదాసు- కైంకర్యముచేసెను॥ కైంకర్యముచేసె గాకుత్స్థకులునకు- సంకటహరణాసర్వాత్మయనిమ్రొక్కి-॥కైంక॥శ్రీకరము గురాజితమణిశాలల - ప్రాకారంబులబహుమతప ఙ్త్కుల్ల-స్తంభాలతరమగు మణిమంటపముల- కంజరాగమణికలితాంగణములచాకచక్యకాంచనకూటం బులనాకాశంబునునంటెడు తేరుల-గోపురమెరసెడిగోపురవితతుల-దీపించువి తర్దికలజడంగుల- తళుకుగులుకుపగడంపుగంబముల- కలువడంబులనుగలకల్లు వడముల- రంగగుముత్యపురంగవల్లికల-శృంగారములగుచిత్రపాళికెల్ల-మక్త తోరణసమాజంబులమణి-ముకురతోరణసమూహంబులకడు- భుగభుగవల చెడుపూచప్పరముల-నగరుధూపములనాలవట్టముల- మెరసెడిరీతినిమేలిమిగా గను॥కైం॥ధారాళమ్ములగుద్వారబంధముల-చారురత్నకాంచనశిఖరంబుల గమగమయనియెడుగంధవాసనల- ఘుమఘుమయనుబలుకుంకుమరసముల-ఘ ణఘణఘణయనుఘంటలతలుపుల- ధణధణయనెడుమృదంగవాద్యముల- ఖిస ఖిసమెరసెడిమేలిమిగోడల-కనకమయంబగుగరుడధ్వజముల- రామరామయ నురామ శుకంబుల- వేమరుపొగడెడువిబుధగణంబుల- ఘాసగమ్రోయుతంబు రులరవంబుల-కొసరియాడుభక్తులనృత్యంబుల- వైనతేయముఖవాహనచయ ముల-పూనిశంఖభుంభుంనాదమ్ములమెరసెడిరీతినిమేలిమిగాగను॥కైంక॥ వెల్ల [illegible] -[illegible] లమంచివాసనల-పిలన గో విగభిర

స్వరముల-ఝల్లరిధక్కాజయనాదంబుల-పల్లవపాణులపాటలనాటల- నల్లలి తోత్పలచయపరిమళముల-వనమాలాసంప్రత్సౌరభములు-ఘనతులసీవనగణగం ధంబుల-రామభజనసంరావోత్కరముల- రామతీర్థసారసములతావుల- రా మస్మరణలరవమధురంబుల- రామభద్రవిగ్రహదర్శనముల-మానుష్యద్విజవాహ నముల ఘనములు- ననుపమశృంగారానందంబుల- రఘునాథ ద్రగిరిరామాలయ మ-త్యమలానందంబై ధరలోపల-మెరసెడిరీతిని మేలిమిగాగను॥ కైంకర్యము॥ తోహారా॥ గర్భగృహ ప్రాకారమంటపాల్ కట్టించెనుకడుభాగా-

నిర్భయుడై యార్లక్షలవరహాల్ నెమ్మదిసెలవటు కాగా॥ ఇది॥ ౪౭

కరుచు జేసికోవెలలోగాగలకైంకర్యము తా జేసెక్-

గురుతరమగతనకోర్కెదీరెననికడుపడియానందించెక్॥ ఇది॥ ౪౮

వ॥ గోపన్న భద్రాచలమందు గోపుర ప్రాకార మంటపాదికైంకర్య ములు శ్రీరామచంద్రస్వామిని సేవించియానందించెనట యెటువలెను॥

మోహనరాగము - చాపుతాళము.

వందేరఘురామ-శుభనామ-శుభనామతులసీదళదామాభిరామా- శ్రీరా మాకనకమణిమయాపారాసుకుమారా- సుకుమారపఙ్క్తిరథమహీపకుమా రా- సువిష్టాతా అనారా - భూభారధీరా-కల్మషదూరా - పాలితవారణ దారుణకారణమదహరణ- రఘువీరా- రఘువీరసీరదాభవిమలశరీరా-నిర్వికా రా॥ వందే॥ వందితయమినివేషా- సత్యభాషాసత్యభాష- సీతాననపంకజపూ షా- బుధతోష- దళితదోష- సజ్జనపోషమానుషవేష- సంగరభీషణభూషణ భూషణ- శోషణజతోషా - రత్నభూషా-రత్నభూష సురాంభోజ-పుంజ ప్రత్యూష- సుమనాసా॥ వందే॥కుంతలజితనీలా- భక్తపాలా- భక్తపాలసుర ద్వేషపటలవిపాలా- వరశీలా- కనకచేలా- కీరకపాలా- మానుషలీలా- దా నవబాలక - తాటకసేవక- సురపాలా- భూపాలకౌస్తుభవనమాల - విశాల శుకపాలా॥ వందే॥ ధరణిజసత్కళత్రా - సుచరిత్రా - సుచరిత్రమునిస్తో త్రా- హృదయాబ్జమిత్రా - సత్పవిత్రా - త్రిశిరజైత్రా-నీరజనేత్రవారిద గాత్రా విపులశాత్రవభైరవకైరవపదమిత్రా- అజపవిత్రా - అజపవిత్ర విభీషణవరభృతజైత్రా- అమరత్రా॥ వందే॥ భూసురకల్పవృక్ష- సత్కటా క్ష-సత్కటాక్ష విరాధమదభహర్యక్షా- మృదుపక్షా- పంకరుహాక్షా - నిజ రూపాక్ష - శత్రువిపక్షా- సువర్ణక్షణ- వీక్షణశీక్షణ- దాక్షిణ రామదాసా- భద్రాద్రీశా అహో రామదాసా- భద్రాదీశా॥ వందే॥

వ॥ మరిన్నీ మనివర్ణింపుచున్నారనిన.

వరాళిరాగము - రూపకతాళము.

ఎంతోమహానుభావుడవు-నీవుయెంతోచక్కనిదేవుడవు॥వింతలునీవుచేసితివి లోకమందు సంతతభద్రాద్రిస్వామి రామచంద్ర॥యెం॥తొలివేల్పుజాంబవంతుని జేసినావు-మలివేల్పుపవనజుగా జేసినావు-వెలయసూర్యుసుగ్రీవుగ జేసినావు.అలసర్వసురులకోతుల జేసినావు॥ యెం॥కారణశ్రీసీతగ జేసినావు- గరిమశేషునిలక్ష్మణుని జేసినావు- యారెంటిభరతశత్రుఘ్నుల జేసినావు- నారాయణనీవునరుడవై నావు॥యెం॥రాతికిప్రాణమురప్పించినావు-నాతియెంగిలి కానందించినావు- కోతిమూకలనెల్లగొలిపించినావు-నీటిపైకొండలనిల్పించినావు॥యెం॥ లంకపై దండెత్తి లగ్గెక్కినావు- రావణకుంభకర్ణుల ద్రుంచినావు-పంకజాక్షి సీతనుపాలించినావు- లంకేశుదివ్యపుష్పకమెక్కినావు॥ యెం॥ పరగనయోధ్యకు బరతెంచినావు- పట్టాభిషిక్తుడవై పాలించినావు - భద్రగిరియందువసియించినావు- ధరలోరామదాసుదయనేలినావు॥ యెంతో॥

తోహరా॥ కొందఱుపురజనులప్పుడుకోవెలకొత్తనాయుననిజూడా-
అందరుసంతసమందిరిగోపననతిధార్మికుడనియాడా॥ఇది॥౪౯
హితులాప్తులుతనకైనవారలుయెంతోయోచననేయ-
మతిలోసర్కారుపైకమనుచునణుమాత్రమెంచలేడాయ॥ఇది॥౫౦
సర్కారుపైకముసెలవుచేయుటిది సరిగాదనియెవరన్నా-
అక్కఱకులుండగురఘుపతినాకొకయల్పమురానియడన్నా॥ఇది॥౫౧

వ॥గోపన్నగారినిహరిభక్తులుసర్కారుపైకమువ్యయముచేయుటచేనాపత్తుసంభవించుననినశ్రీరామచంద్రులనమ్మినవారలకాపదగల్గదనిచెప్పుచున్నారు॥

ఉ॥ హాళినిదాటకిన్దునిమియాగముగాచియహల్యబ్రోచిసీ। తాలలనన్వరించిరణదర్పితరావణకుంభకర్ణము। ఖ్యాళివధించిరాజ్యమునయంబుగనేలిన రామ చంద్రభూ। పాలుదురంగశాయిమనపాలగలండువిచారమేటికిన్॥

నాదనామక్రియరాగము - ఆదితాళము.

తక్కువేమిమనకూ - రాముండొక్కడుండువరకు ॥ పక్కతోడుగాభగవంతుడుమనను-చక్రధారియైచెంతనేయుండగ॥తక్కు॥ముచ్చసోమకునిమును జంపినయా-మత్స్యమూర్తిమనపక్షమునుండగ॥ తక్కు॥సురలకొరకు మందరగిరి మోచిన- కూర్మావతారునికృపగలిగుండగ॥తక్కు॥దురాత్మహిరణ్యా

క్షుద్రుంచిన-వరాహమూర్తిమనవాడై యుండగ॥తక్క॥హిరణ్యాకశిపునియురుచెక్కలుగా-బరచిననరహరిపక్కనునుండగ ॥ తక్క ॥ భూమిస్వర్గమును బొందుగగొలిచిన- వామనుడునుమనవాడై యుండగ॥తక్క॥ధరలోక్షత్రియులనుదండించిన- పరశురాముడుమనపాలిటనుండగ॥తక్క॥దశగ్రీవునుదండించినయా - దశరథరాముని దయగలిగుండగ ॥ తక్క ॥ ఇలలోయదుకులమందుదయించిన - బలరాముడుమనబలిమై యుండగ॥ తక్క ॥ దుష్టకంసునీద్రుంచినట్టిశ్రీ- కృష్ణుడుమనపై కృపగలిగుండగ॥ తక్క॥కలియుగాంత్యమున గలిగెడుదైవము- కలికిమూర్తిమముగాచియుండగ॥ తక్క ॥ నారాయణదాసులగాచెడిశ్రీ-మన్నారాయణుసెరనమ్మియుండగ॥తక్క॥

తోహర॥ బ్రహ్మోత్సవములు బ్రహ్మార్పణమనిభాగవతుడుచేయించక
బ్రహ్మజనకపదమందునునీగోపన్నయనుచు ప్రజలెంచక॥ఇది॥౫౨॥
ఈగతిభద్రాచలమునగోపనయోగభోగములనుండక.
త్యాగభోగములసిరులజెలగుమాదన్నగారుగోల్కొండక॥ఇది॥౫౩
అలగోల్కొండదివానులప్పుడులెక్కలుతనికీలటుసేయక.
చిలుకార్గత్తుల్లపై కముభద్రాచలమునునిలిచినదామెక॥ఇది॥౫౪
కలికచెందిమాదన్నగారుయక్కన్నగారికిదిదెల్పక.
అలగోపన్నకుయిదిదెల్పగనాకయాభ్తునిపేగటువసిచెక॥ఇది॥౫౫॥

వ॥ ఈ ప్రకారంబుననక్కన్నగారివద్దినుంచివచ్చిన పరమాప్తుండుగోపన్నగారితో గోల్కొండతోచేరినతాలూకాల లెక్కలుతనికిసేయగా మీతాలూకాకిస్తి ఆరులక్షులపై కమునిల్వమేర్పడితాసీమకు తెలియచేయకమీకుముందు తెలియజేయుమని అక్కన్నగారు చెప్పినవాక్యంబులువినుమని యిట్లనియె॥

క॥ అన్నాద్రవ్యముఁబంపక । యున్నావికనృపతితోడ నూర్జితముఁగనే।
విన్నపముఁజేతుననియు । క్కన్నయుదెల్పుమనెనన్ననతడిట్లనియెక॥

క॥ శ్రీరాములకై ంకర్యం। బారూఢిగజేసిభద్రనగమందునమీ । కారుణ్యకటాక్షమునక । ధీరుడనై యున్నవాఁడఁజేరినమదితోక॥

క ॥ రాములకటాక్షవీక్షణ। మామోదముగాఁగనున్ననరలేకనుమీ। భూమీశుపన్నుపైకం। బేమాత్రముకొరతలేకనికఁజెల్లఁబడుక॥

క ॥ భూమీశునికృపగల్గిన । భూమీశుని కృపయుగల్గు భూతల మందుక।
భూమీశునికృపలేమిని । భూమీశునికృపయులేదుభూతలమందుక॥

క॥ అనియిటులఁ జెప్పవారలు । వినియాశ్చర్యంబునొంది వెసజనియ్యవ
టన్ । గనియామంత్రులతోడను । వినినతెలుగుఁ జెప్పిరధికవిశదముగాఁగన్॥

క॥ శ్రీరామరామయనవే । సారక శ్రీరామనామసారముగ్రోలున్ ।
రారారామాయనివే । మారునుబిల్చుచునునట్టినై దామఅచున్॥

వ॥ ఇవ్విధంబునంబల్కిన గోపన్నవాక్యంబులను నడతయునుఁ జెప్పగా
వినినవారు దీనాననులై యుండిరంత నిచ్చటగోపన్నగారితో తమవారు అనేక
విధంబులుగామందలించి సర్కారుపైకము వ్రయమై నందున రాజాజ్ఞకులో
బడనిక్రమంబెట్లనో విచారించుకొమ్మని చెప్పిననిని॥

తోహరా॥ అసితమవారలునాడెడిపలుకుల నాలకించియెంచకనూ-
మనమునరాముని మరువకయుండెను మానఘనులుపొగడగనూ॥ ఇది॥ ౫౬

ఉ॥ నమ్మితిరామచంద్ర మదినమ్మితి రాజకులేంద్రమేలుగా । నమ్మితి కీర్తి
సాంద్రకడునమ్మితిదాసచకోరచంద్రనా । నమ్మికలేమిచేసెదవొ నమ్మగనర్హు
లుగానివారల । న్నమ్మనయాదయాబ్ధివనేనమ్మితిని న్నదిజానకీపతీ॥

నాదనామక్రియరాగము - ఆదితాళము.

ఏతీరుగననుదయజూచెదవో యినవంశోత్తమరామా - నాతరమాభవ
సాగరమీదనునళినదళేక్షణరామా॥ ఏ॥ శ్రీరఘునందనసీతారమణాశ్రితజన
పోషకరామా- కారుణ్యాలయభక్తవరదననుకన్నదికానుపురామా॥ఏ॥మురి
పెముతోనాస్వామివినీవని ముందుగదెల్పితిరామా - మరువక యికనభిమాన
ముంచునీమరుగుజొచ్చితినిరామా॥ ఏ॥ క్రూరకర్మములునేరకచేసితినేరము
లెంచకురామా- దారిద్ర్యముపరిహారముసేయవెదైవశిఖామణిరామా॥ఏ॥
గురుడవునామదిదైవమునీవని యురుశాస్త్రంబులురామా - గురుదైవంబని
యెరుగకతిరిగెడుక్రూరుడనైతినిరామా॥ ఏ॥ తాండవమునయఖిలాండకోటి
బ్రహ్మాండనాయకారామా-బంధనమునసీనామామ్ముదలచిన బ్రహ్మానందము
రామా॥ ఏ॥వాసవకమలభవామరవందితవారధిబంధనరామా-భాసురవరస
ద్గుణములుగల్గినభద్రాద్రీశ్వరరామా॥ఏ॥వాసవనుతరామదాసపోషకావం
శనమయోధ్యరామా-దాసార్చితమ్మాకభయమొసంగవెదైవశిఖామణిరామా

తోహరా॥ అప్పుడుపాచ్ఛాకొలువుననాయాతాలూకాల్ సహజముగా-
వొప్పుగపైకమువచ్చెనెయనితనవుద్యోగస్థులనడుగా॥ ఇది॥ ౫౭॥
అన్నితాలుకాల్పైకమువచ్చెనుయనియిచ్చిరితమలెక్క—

తిన్నగజెప్పిరిహజరత్ యాభద్రాచలమెక్కటిదక్క॥ ఇది॥ ౫౮॥
ఏలరాదుభద్రాచలపై కంబేమిముఖాంత్రంబనినా॥
చాలగవ్రయపరిచెనుగోపన్నయుసర్కార్పై కములోనా॥ ఇది॥ ౫౯॥

వ॥ గోపన్నగారు సర్కారుపై కమును వ్రయముచేసి భద్రాచల సీతారామస్వాములవారి కైంకర్యములుచేసినారని యుద్యోగస్థులుచాడీలు చెప్పుచున్నారు.

నాదనామక్రియరాగము. అటతాళము.

వినవయ్యాతానీషగారూ - మామనవిచేకొనవయ్యా మహారాజామీరూ॥
విన॥దినదినమునువారియింటా-విప్రవరులసంతర్పణవిందులటంటా-జేసేదిస రకారుతంటా- రుజువుచేస్తాముహర్కారులబంపువెంటా॥విన॥దండికాపులు బలసిరందూ- చేరిచేసేటితంటలుమేమనుకొందూ- ఆరులక్షలపైకమందూ. నిలిచిసర్కారుకురాకబోయెనుయిందూ॥ విన॥బొక్కసములుపాడాయె-దేవాలయములు బహుశాచక్కగనాయె-లెక్కలుసరిలేదాయె - హజూరికిరూకాలురాకనెపోయె॥విన॥తక్తాధికారులుమీరూ-తహశీలుచేసేటియాగోపన్నగారూ-చాలాతంటలుచేసినారూ-తానిషపైకమంతకొల్లగొట్టుచున్నారూ। విన॥ రామచంద్రుజనమ్మినారూ-శ్రీభద్రాద్రిపురియందుబాగైయున్నారూ। జాగుసేయకయింకమీరూ-వారినిరప్పిస్తెతెలుసుననికోరుబారూ॥ విన॥

తోహరా॥ ఇట్లనిచెప్పినపాచ్చాకన్నులుయెఱ్ఱచేసికోపించెక్.
యెట్లుకర్చుజేసెనుగోపన్నకుయెంతకుదుర్తనియెంచెక్॥ ఇది॥ ౬౦॥
హర్కారులుమీరాగోపన్నను నరలేకందరుజూడా.
సర్కార్పైకములెక్కతోతెండిసకలఖాయిదాతోడా॥ ఇది॥ ౬౧॥

క॥ గోపన్నసుదోద్రైమ్మని - భూపతినియమించెభూరిభుజమ్లేచ్ఛులను ద్దీపితయమభటసములక్। బాయుతులఁగ్రూరమతులగుటిలులఖిలులక్॥

తోహరా॥ హుకుంచేకొనియిరుపురుహర్కార్లుజ్జితంబుగావచ్చి-
గ్రక్కునయాగోపన్నగారిబార్కచ్చేరిలోపలజొచ్చి॥ ఇది॥ ౬౨॥
క్యాజీగోపన్న సలాంతుం దేఖోతానీషాబల్హుకుం.
ఆవుజీ హుటోజీ చెల్జీ యనివారాడిరినిష్ఠురవాక్యం॥ఇది॥౬౩॥

వ॥ హర్కారులు రామదాసువారికి తానీషా హుకుమును చూరమ్మనిచెప్పుచున్నారు॥

అసావేరిరాగము - రూపకతాళము.

అవుమ్యా అమారబాషాక్పాస్ చెల్‌మ్యా - గోల్కొండకు చేల్‌మ్యా
రేలేవుమ్యా- అంటెమే మోయోచించేవుమ్యా-అరేవుటోవుటోవుటోచెల్॥
వు॥ దివాసిదిండు టెక్యాలోడు - దిగూనబాబుహుకుమిదిజూడు- బాబుమా
సరిగానేడు-చెప్పినీమానముగాపాడు॥ అవు॥అవరంగబాదుతగ త్తులోనా
నేకతహశీర్‌దార్లున్నారు-వారిపైబాకీల్‌సున్నాయేమోసీపైబాకీశానా॥అ॥
మిషమైనానిలువనీయము-నిలువలన్నిర్ఘూడాపైకము-చేకొనువేగమెయిపుడు
ర్బందుచేకొందుముచూడు॥అవు॥అరలేకానీవేయిాసీమా- కధికారైనవెరు
మమీ- ధారభద్రాద్రిశ్రీరామదాసుడనిదాళితిమిసుమ్మా॥ అవుమ్యా॥
హరా॥ ఈవిధినాడినహర్కారులతోమెంతోహితవుమీరగనూ-
భావముదెల్పుడిసాధులార ఫిర్యాదేమిసర్కార్లోనూ॥ ఇది ॥ ౬౪॥
అనియడిగినహర్కారులుచెప్పిరియన్ని ఖజానాల్‌వచ్చెన్-
వినునీతాలూక్ బాకీలేబహునిండయనుచుకోపించెన్॥ ఇది ॥ ౬౫॥
ఇట్లనిచెప్పినగోపనమనమున నెలమిమీరయోచించెన్-
యెట్లుచేసినను రఘుపతియుండగనెందుకుభయమనియెంచెన్॥ఇది॥౬౬॥

వ॥ ఈప్రకారంబున భద్రాద్రినుంచి గోపన్నగారిని ఖండితమైన
మ్చుకత్తిపారాల్లతో తెచ్చునప్పుడు భద్రాద్రినిలయునింగూర్చి యేమనిమన
చేయుచున్నారనిన॥

చ॥ కటకట రామచంద్రననుగావగదేయిటువేగరాగదే। కుటిలమనస్కు
రిపులుక్రూరభయంకరతర్జనంబులన్ । బటుతరరోషభీషణత బాధలఁబె
ఁగ దాళజాలనీ । పటువిశిఖంబులందునిమిపారఁగఁదోలవెజానకీపతీ॥

పూరికల్యాణిరాగము - ఆదితాళము.

నీసంకల్పంబెటువంటిదో గననెంతవాఁడరామా- వాసిదొలగినీ దాసజను
భువిగాసివడినయాఘనమెవ్వరిదో ॥ నీసం ॥ ప్రోచినమరివిడజూచిననీకృప
చియుందుగానీ- తోచితోచకనుతోడరి కరంబులసాచిపరులనే యాచనసే
సు॥ నీసం॥ పటుతరముగనీమటుమాయలకునుమెటువలెయోరుతును-చటుల
ంబుగజెలగుభవాంబుధియెటుకడతేరుదుమెవరినిదూరుదు॥ నీసం॥ భావజ
నుతపరమపురుషనీభావముదెలియదుగా- దేవదేవనీసేవకజనులకు సేవకు
ననుగావుము మ్రొక్కెదా॥ నీసం॥ దరిజేర్చెదవని ధైర్యముచేనీదరిజేరితిగాని
సిప్రోవకనుఆరడిజెట్టుటమెరుగనైతినాధారవనుకొంటిని॥ నీసం ॥ శర

గతరక్షణభవసాగర తరణారిపుహరణా - కరుణజూడు భద్రాద్రినివాసా - అరమరసేయకుహరినినునమ్మితి॥ సీసం॥

వ॥ గోపన్నగారు దేహ మనిత్యంబని తానీషహుకుమును జూచి ధైర్యంబవలంబించి శ్రీరాముల స్తుతించుచున్నారు॥

శా॥ శ్రీరంజిల్లెడు మోముతో మురువుగా జీరాడుమేల్శాలుతో। కారుణ్యామృతధారతో ఘనలసద్గ్రైవేయహారాళితో। సారౌన్నత్య విభూషణ ప్రతతితో శాంత స్వరూపంబుతో। రారానాకభయప్రదాన మియరారా మామహీజాధిపా॥

శా॥ పోకన్నా నదు దేహమేవిధమునన్ బోషించి రక్షించినన్। రాకన్నా నవుహానివృద్ధులు మహారణ్యంబులో డాగినన్। కాకన్నా నవుపూర్వజన్మకృతముల్ కాగల్గుయర్థంబులన్। తేకన్నా నవుయెంతజాలిబడినన్ లేముల్ సిరుల్ రాఘవా॥

వ॥ ఇట్లు చింతించు సమయంబున॥

తోహరా॥ ఖయిదుచేసికొనిగోపననప్పుడు కారుబారు వెడలించి.
హాయిదరబాదుకుతోడుకపోయిరియటు పారాలో నుంచి॥ ఇది॥ ౬౭॥
ఈవిధమునగోపన్ను హార్కాల్లే పునగొనిపోవగనూ -
భావజుగన్న భద్రాచలరాములభావమందు నిడుకొనెనూ

ఉ॥ నమ్మిననన్నెనమ్మవలెనౌనదియట్లు విరోధితమ్మని। న్నమ్మినరాజు జేసితివనాథలపాలిటిదైవరాయనే। నమ్మమరెవ్వరిన్ మిగులనమ్మితిని ర్మలకర్మ చిత్తవా। క్యమ్ములనిన్ను నమ్మితినఖండకృపానిధిజానకీపతీ॥

తోడిరాగము - అటతాళము,

దాహ్హాదైవశిఖామణీ-సురరాజమనోజ్జ్వలభూమణీ॥ తామరసాక్షసుధీమణీ-భవ్యతారకభక్తచింతామణీ॥ రామా॥ నాడేమిము వేడుకొంటిగా-శరణాగతబిరుదనివింటిగా- వేడ్కైమిముపొగడగంటిగా-సన్నదిగవిడనాడవద్దంటిగా॥ రామా॥ చింతసేయగనేమిలేదుగా - ముందుజేసినగతిదప్పబోదుగా - యింతకుమిక్కిలిరాదుగా- నేనితరులగొలిచేదిలేదుగా॥ రామా॥ తమ్ముడునీవాక్కజంటనూ- రామదాసునిరక్షించుకుంటనూ - సమ్మతినుండుమాయింటనూ- భద్రాచలవాసనీబంటుబంటనూ॥ రామా॥

యమునారాగము - చాపుతాళము,

దీనదయాళో దీనదయాళో - దీనదయాపర దేవదయాళో॥ దీన॥ కనకాంబరఘనశ్యామదయాళో - సనకాదిమునియోగినుతదయాళో॥ దీన॥ శరధిబం

శ రామచంద్రదయాళో - వరదామరబృందానందదయాళో ॥ దీన॥ నారదముని దేవనాథదయాళో - సారసాక్షరఘునాథదయాళో ॥దీన॥ దశరథసుతలోకాధారదయాళో - పశుపతిచాపత్రుటితదయాళో ॥ దీన॥ ఆగమకల్పితఅమితదయాళో - భోగిశయనపరమపురుషదయాళో ॥ దీన ॥ వరభద్రాద్రినివాసదయాళో పాలితశ్రీరామదాసదయాళో ॥ దీన ॥

ఉ॥ అంటినభక్తిచేతనుభయంబు లోకయించుకలేకనమ్మినే। నుంటినిబంటుబంటకడునొప్పికిమిక్కిలితాళనంటినే । కంటకమేటికంటినను గాచుటనీకెదిధర్మమంటినో । కంటిని రెప్పరీతిననుగావుమటంటిని జానకీపతీ॥

యమునాకల్యాణిరాగము - ఆదితాళము

గరుడగమనరారా - ననునీకరుణనేలుకోరా ॥ పరమపురుషయేవెరవులేకనీ - మరుగుజొచ్చితినరమరసేయకు॥ గరుడ ॥ పిలువగానేరమ్మి- యభయము తలవగానేయిమ్మి - కలిమిబలిమినాకిలలోనీవని - పవలరెంచితినినన్ను వనుగన్నయ్య ॥ గరుడ ॥ పాలకడలిశయనా - దశరథబాలజలజనయనా - పాలముంచు ననునీళ్ళ ముంచునీ - పాలబడితినికజాలముసేయకు ॥ గరుడ॥ ఏలరావుస్వామీ- నను నిప్పు డేలుకోవదేమి - యేలువాడవని చాలనమ్మితిని - యేలరావు కరుణాలవాలహరి ॥ గ ॥ ఇంతపంతమేలా - భద్రగిరీశవరకృపాలా-వింతలణచి శ్రీరామదాసుని - అంతరంగపతివై రక్షించుమి ॥ గరుడగమనరారా॥

తోహరా॥ రామరామనన్నిటుచేయుటనాప్రాతఫలమొనీవలెనో-
కోమలదేహకుజనులచేననుగొట్టించనుమతిగలిగో ॥ ఇది ॥ ౮౯॥

ఉ॥ ఏమిర రామచంద్రయికనేటికినేచెదుమాటిమాటికి। న్నామరుడాటనోమిగులచాతకజాలములోననుంటినో । యేమియొనర్చి నన్నుతుని యెగ్గులదంట్రికిగన్నపుట్టునే । నీమదిజిత్తగింపుమికనిక్కమునమ్మితిజానకీపతీ॥

వ॥ ఓభద్రాద్రీశ్వరా నేనుపూర్వజన్మంబున జేసినకర్మశేషమో లేక మీకరుణకు పాత్రుండనుగాననియో యీదుర్మదులచే గొట్టించుటకు మనస్సు కలిగియో యివ్విధంబుగానన్ను చేయించుటతగునాయని స్తుతిచేయుచున్నారు.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

యేమిరారామా- నావల్ల నేరమేమిరా రామా॥ యేమిరాయీలాగుకష్టము- నీమహిమో నాప్రారబ్ధమో॥ యే ॥ కుండలిశయనవేదండరక్షకా -ఖండతేజనాయండనుండవే॥ యే॥ పంకజలోచనశంకరనుతనా-సంకటమూర్ప వెపాంకముతోనూ॥యే॥మందరధరనీసుందరపదములు - యిందిరేశగనుగొందు జూ

పచే॥ మే॥ద్దినమొకమేడుగఘనముగగడిపెద-తనయునిమీదనుదయలేదయరామా మే॥ సదయహృదయనీమృదుపదములునా-హృదయకమలమునవదలకనిల్పెద॥ మే॥ రాఘురామభద్రాచలసీతా- రామదాసుని ప్రేమతో నేలవే॥ మేమి॥
తో హారా॥ బాగాయనునినునమ్మినందులకుభోగిశయనరఘురామా-
జాగుసేయకనుబ్రోవుసమయమునజగదీశాపరంధామా॥ ఇది ॥ ౭౦ ॥

వ॥ స్వామీనిన్నునమ్మినందుకు ఇటులజేయుట దగదు రక్షించుటకిదిసమయమని మొరలిడుచున్నారు॥

శంకరాభరణరాగము - రూపకతాళము.

రక్షించుయిదియేమోరాచకార్యముపుట్టెరామచంద్రా- నన్నురక్షింపకున్నురక్షకులెవరింకరామచంద్రా॥ రక్షించు॥అప్పులవారొచ్చిఅరికట్టుకున్నారురామచంద్రా-స్వామీచెప్పశక్యముగాదు చక్షుర్గోచరమాయె రామచంద్రా॥ రక్షించు ॥ కుక్షిలోమీమీదకోరికపుట్టెను రామచంద్రా- స్వామీయిక్ష్వాకుకులతిలకయికనైనగావవేరామచంద్రా॥రక్షించు॥పక్షివాహనుడపాలించిదయజూడురామచంద్రా-స్వామీఅక్షయకటాక్షఅభిమానముంచవేరామచంద్రా॥ రక్షించు ॥ అధికునిచేపడితిఅడ్డమేమనుకొంటిరామచంద్రా- స్వామీఅక్షములకన్నుఅన్యాయమైపోతిరామచంద్రా॥రక్షించు॥భయమేమినేరామదాసుడనుకొంటి రామచంద్రా- స్వామీభయముబాపిబ్రోవుభద్రాద్రిపురనిలయరామచంద్రా॥రక్షించు॥

వ॥ ఓభద్రగిరినిలయా నానుతులనంగీకరించి యీయాపదనుబాపిరక్షించుమని మనవిజేయుచున్నారు॥

అసావేరిరాగము - రూపకతాళము,

రామానామనివిచేకొనుమా- దైవ- రాయపరాకుసేయకుమా-స్వామిభద్రాచలధామపావనదివ్య- నామగిరిజనుతభీమపరాక్రమ॥ రామా॥దరిలేనిదీనజనులనుగాచే- బిరుదుబూనితివిఖ్యాతిగనూ- గురుతరశమనకింకరబాధలకు నీ- మరుగుజేరితినన్నురమరసేయక॥ రామా॥ కపటమానసుడనిమతిని- యెన్నకిపుడురక్షించుసమ్మతిని- అపరాధములకేనాలాయమైతిని-కృపజూడుమీనాదునెపములెన్నకస్వామీ॥ రామా ॥ పతితపావనమూర్తివైనా - నీవే- గతియనియుంటిమతిలోనా-సతతమురామదాసపతివైభద్రాద్రిని. అతులితవైభవగతులచేనెలకొన్న॥ రామా॥

వ॥ ఓభద్రశైలాధివాసా మిమ్ములనుతప్ప అన్యమెరుంగను కన్నడసేయక కాపాడుమనుచున్నారు॥

శంకరాభరణము - ఏకతాళము.

ఇతరమెరుగానయ్యా-నాగతినీవేరామయ్యా సతతమునీతాపతినీవేయని- మతినమ్మితిసద్గతిజెందింపుము॥ ఇతరము॥ కోపముసేయగవద్దు- నాకోరికలొసగుమీ ప్రొద్దు-ప్రామరుతనివిడువవద్దు-నాపాపముబాపుమీ ప్రొద్దు-ప్రాపుదాపునా ప్రాణమునీవే- యీపట్టునమిముపట్టుసల్లనిక॥ ఇతరము॥ తప్పులెన్నవద్దంటి-నాతల్లిదండ్రీవీవంటి-మాయొప్పులకుప్పవటంటి-మాయప్పవునీవనుకొంటి- అప్పటప్పటికితప్పకనీవే-నెపములెన్నకీను నేర్పున నేలుమి॥ఇతరము॥ సామీదనుదయరాదా-రామనామనవినివినరాదా- వేమరునాతోవాదా-నన్నెరువకుమీయనరాదా॥ ప్రేమమీరమాభద్రాచలపురి-ధాముడవై రామదాసునినేలుమి॥ ఇతరము॥

వ॥ నేనపరాధినైనను క్షమించిరక్షింపుమని స్తుతింపుచున్నారు॥

అసావేరిరాగము - ఆదితాళము,

నాతప్పులన్ని క్షమించుమీ- జగన్నాథనీవాడరక్షించుమీ॥ పాతకుడనిమెంచపనిలేదుపోషింప- దాతవనుచునీపాదములేనమ్మితి॥ నా ॥ ఈయెడనానేరమెంచకూ- నాహితవునద్వేషములుంచకూ-చేయరానివల్ల చేసితిక్షమచేయు-కాయతీగెకుమెగ్గుగాదని మ్రొక్కెద॥ నా ॥ కడుపునబుట్టినతనయుడూ-ఎంతోదుడుకుతనముచేసేటప్పుడు- కొడుకురమ్మనిచేకొనుగానినూతిలో-పడద్రోయునామెంతపాపాత్మకుడైన॥ నా ॥ దాసునిమనవిచేకొంటివా- చక్రధరయికనన్నేలుకొంటివా-నాస్వామినీవనినమ్మితిభద్రాద్రి- వాసుడవై రామదాసునేలినతండ్రి॥ నాతప్పు॥

తోహరా॥ ఈవిధమునశ్రీరాములదలచుచుమేగెనుప్రాచ్యాసభకూ-
భూవరుడగుతానీషదెమ్మనెనుభూసురవరుతనకడకూ॥ ఇది॥ ౭౩॥
తెచ్చిరిగోపన్ననుపారాతోతేజరిల్ల తెంపుననూ-
వచ్చినభూసురుజూచితానిషావైరమెంచియిట్లనెనూ॥ ఇది॥ ౭౪॥

నాదనామక్రియరాగము - ఆదితాళము,

రండి గోపన్నగారు-మాపైకమొప్పించండీ వేగమేమీరు-భూమండలములోనగోలాకొండతురకవాడుచాలా-బండాడనిసుంతైననీగుండెలోనుంచావైవి॥ రండీ॥ గోపన్నగారివాక్యం॥వినండీతానీషగారు-వేలానాపైనుద్దండకో

పముచేసేరు-కిండక్రొవ్వుచేతనేను- తుంటారీకముసేయను--భూమండలము
లోనుమీకీర్తినిండాగల్గజేసినాను॥ వి ॥ పాదుషావాక్యం ॥ తానసంపాదించిచేసి
నా- ధర్మానగల్గును కీర్తిమేశాస్త్రజ్ఞుడు యిప్పుడు - నీకీమతిగల్పించి నాడు॥
రండి॥ గోపన్నగారివాక్యం॥ ఘనమైనమీనగరూ - కొక్కదినముఖర్చుగనదు-
స్వల్ప-ధనమిదోమీభద్రాచలపురములోగుడికట్టున్నాను॥ వి ॥ పాదుషా వా
క్యం॥ బలవంతులధనమూ- వారిసెలవులేకఖర్చుసేయ- తలపోవుననిమదిలో-
తలపోయనైతివిదేమి॥ రండి॥ గోపన్నగారివాక్యం॥ స్థిరమానీదేహమిప్పట్లో-
నెరనమ్మలేదునీయట్లా- దొరభద్రాచల శ్రీరామ-దాసుడనై చేసితిసుమ్మా॥
వినండీతానీషగారు- యేలానాపైనుద్దండకోపముచేసేరూ॥

తోహరా॥ గోపనధైర్యస్థైర్యములనుగనికోపమందితానీషా-
యేపుననీమదమణగించెదనేనిప్పుడుజూడుతమాషా॥ ఇది॥ ౭౩॥
సాలాఖరులోసర్కారుపైకముసరిగసేలరాదోయీ-
చాలాతప్పులుచేసినావునాచనువునీపై లేదోయీ॥ ఇది॥ ౭౪॥
నన్నుమెంచకపోయిననునాజాతినియెంచగరాదా-
నిన్నుతెలియకసెలవుచేయుటిదితానిషపైకముగాదా॥ ఇది॥ ౭౫॥
చెక్కనమెంచక్షత్రయపై కంబతివేగమెయిస్తున్నావా-
కక్కసమైనమహాహుకుంమేరకుఖైదునవుంటున్నావా॥ ఇది॥ ౭౬॥
పైకంబడిగినపలుకులుతడబడిపలుమాటలనాడెదవూ-
పైకమందినటువలెనున్నావుమామగైరుగవసీవూ॥ ఇది ॥ ౭౭॥
అనితానీషాయడిగినపల్కులనాలకించిగోపన్నా-
వినుతక్సీర్నేచేసినతప్పులువినుపించెదఖునలెన్నా॥ ఇది॥ ౭౮॥
నీవుబంపినతహశీల్పనిలోనిజముగానునేనున్నా-
భావములోహరిభక్తివిడకబహుభద్రముగానేయున్నా॥ఇది॥ ౭౯॥
జీవాధారుడు॥రామునికోవెలజీర్ణోద్ధారణనేనూ-
నీవాడై నేచేసితిహజరత్ నీధర్మంబదియనేనూ॥ ఇది॥ ౮౦॥
గోపనచేసినకైంకర్యమునకుకొంతదడవుయూహించి-
యేపుననమునుపటిసుకృతముమనమునసెలమిమీరయోచించీ॥ ఇది॥౮౧॥
గోపనపై నేకోపముసేయకకొంచముగావిడిచిననూ-
యీపగిదిగతహశీల్దాగులుమెంచకనడుతురుతుదనూ॥ ఇది ॥ ౮౨ ॥

అనుచు తానీషయునందరువినహార్కారులతోనిట్లనెనూ-
వినుడికనొకవారములోపై కముయెల్లవసూల్ కావలెనూ॥ ఇది ॥ ౬౩॥
అనితానీషాయాగోపన్ననునపుడుబందిఖానకునూ-
గొనిపొమ్మనిక్రూరముగాబల్కెనుకొంకులేకమనముననూ॥ ఇది॥ ౬౪॥

వ॥ తానీషగారుశ్రీ రామదాసుల వారిని ఖయిదుకు తీసుకపొమ్మను మనిహార్కారులకు వుత్తరవుచేయు సమయంబున రామదాసు గారుశ్రీరాములవారిని రక్షించుమని మొరబెట్టుచున్నారు॥

ఉ॥ దీక్షవహించినాకొలదిదీనులనెందరిగాచితోజగ । ద్రక్షకమున్ను నాద్రుపదరాజతనూజదలంచినంతనే । యక్షయమైనవల్వలిడి తక్కటనామొరాలకించి ప్ర । త్యక్షముగావదేమిటికిదాశరథీకరుణాపయోనిధీ॥

వరాళిరాగము - ఆదితాళము,

ఏడనున్నాడో- భద్రాద్రివాసుడేడనున్నాడో - నాపాలిరాము- డేడనున్నాడో॥ యేడనున్నాడోజాడదెలియరాదు- నాడుగజేంద్రునికీడుబాపినస్వామి॥ ఏడ॥ ద్రౌణిబాణజ్వాలదాకినబాలునికి- ప్రాణమిచ్చినజగత్రాణరక్షకుడు॥ఏడ ॥ పాంచాలిసభలోనుభంగమొందిననాడు - వంచనలేకనువలువలిచ్చినతండ్రి॥ ఏడ ॥ దుర్వాసుడుగ్రముతో ధర్మ సుతుజూడ నిర్వహించిన నవనీతచోరకుడు॥ఏడ॥అక్షయముగశ్రీభద్రాచలమందుసాక్షాత్కరించిన జగదేకవీరుడు ॥ యేడనున్నాడో॥

తోహరా॥ గోపన నప్పుడుబందిఖానకుకొంచపోవుటదిచూచీ-
ఆపట్టణమునసందరువగచిరియనుతాపముమదిదలచీ॥ ఇది॥ ౬౫॥
పోవుచుండబ్రజలందరుపురపురబొక్కుచుతమమదిగుందీ-
దేవునిరామునిదూరుచునందరుదీనతనొందిరికందీ॥ ఇది॥ ౬౬॥

వ॥ ఇవ్విధంబున దశరథకుమార స్మరణాయత్తచిత్తులై తన్నుంగనినపౌరజనంబులార్తహృదయులై పరివేదనంబునొందుచుండం బ్రభుని యమనానుసారులై నహార్కారులు బందిఖానాకుకొనిపోవు సమయంబున గోపన్న శ్రీరామునియిట్లుపేక్షింపందగునాయని వేడుకొనుచున్నారు॥

శంకరాభరణరాగము - రూపకతాళము.

తగునయ్యాదశరథరామచంద్రదయవలచవేమీ-నీకుంపగవాడనా యెంతోబతిమాలినగానిబల్కవేమీ॥ తగు ॥ నగుమోముజూపరనాయన్న నినుచాల నమ్మినానూ-యింత - అగడుగజూచితే నావలయెవరిపాలయ్యానేను ॥ తగు ॥

పతితులనెల్ల నుపావనుల జేయుదు ననిపలుక నేలా- యిప్పుడు అతిఘోరఖలులమ నుచుమమ్మునవిడనాడ నేలా॥ తగు ॥ అన్నన్న గానిరాకున్నావువో రామనిన్ను మానా - నే - నిన్నెగానిపరులనెన్నబోనునాకన్నులాన॥ తగు ॥ పదపడిమిము చేరబడినవారలను చేపట్టలేదా- నన్ను- వదలితేమీవంటివారికి యపకీర్తివాదు గాదా॥ తగు ॥ అనుదినముభద్రాద్రిధాముడవనినిన్న రసినానూ- నేనువినయ ముతో రామదాసుడననివిన్న వించినానూ॥ తగునయ్యా॥

చ॥ కుక్షినజాండపఙ్క్తులొనగూర్చి చరాచరజంతుకోటిసం । రక్షణసేయుతండ్రివి పరంపరగాతనయుండనైననా । పక్షమునీవుగాంగదవె విన్న పముక్షయెదనుంచుమోజగ। త్రక్షకకర్తవీవెకదదాశరథీకరుణాపయోనిధీ॥

నాదనామక్రియరాగము - ఏకతాళము.

సెలవామాకుసెలవా- యీచెరకేగ- సెలవా ॥ సెలవామాకీక జలజసంభవనుత- జలజాతనేత్ర సజ్జనమిత్ర శ్రీరామ॥ సెలవా॥ నీవానన్నేలుకోవా-యిటువేగరావాసమయముకావా రామయ్యా ॥ సెలవా॥ వాశిగభద్రాద్రివాసా వరరామ- దాసాహృదయనివాసారామయ్యా॥ సెలవా॥

వ॥ ఇవ్విధంబున రాముని దలంచు సమయంబున॥

తోహరా॥ భూపతియుంచెనుబందిఖానలోభూరిబలులసంఘముతో-
దోపననప్పుడుద్వాదశసమములు ఘోరమైనశితులతో॥ ఇది॥౮౭॥
తాపమునొందుచుచింతించెను శ్రీసీతారామాయనుచూ-
శ్రీపతిరక్షకుడనితానుండెను శ్రీహరిహరియనుచూ॥౮౮॥

వ ॥ ఈప్రకారముగా రామస్మరణసేయుచువచ్చుచుండెడి రామదాసుగారిని హర్కారులు కారాగృహప్రవేశముసేయించిన తరువాత నప్పర మభాగవతకులాలంకారుండేకచిత్తుండై దేవానామొఱరయాలకింపక నెందరిగితివని శ్రీరామదేవుని వేడుకొనుచున్నారు॥

ఆనందభైరవిరాగము - అటతాళము.

ఎటుబోతివో రామా యెటుబోతివో॥ ఎటుబోతివో నిన్ను నేవేడుకొనుచుంటే - కటకటా నేడునాకనులజూతామంటే॥ ఎటు॥ అంధకారమువంటిబందఖానాలోనున్న - నిందెలనేడబాపవేలనీకుమ్రొక్కెనుస్వామీ॥ ఎటు ॥ పాపములన్నియెడబాపేటిదొరవునీవు. ఆపదదీర్చినన్నాదుకొమ్మంటి స్వామీ॥ ఎటు॥ తానీషాగారువచ్చితరితీర్పుజేస్తున్నారు- పైకముబంపించివేగబందీఖానావదలించక॥ఎ॥ అపరాధిననిచాలనతి చేసిమొరలిడగ - వెనుకటినేరముల నెపముగ

యెంచుక॥ ఎటు॥ అప్పులవారువచ్చియరికట్టుకున్నారు - ఒప్పుకోబడునని చె
ప్పకదాగున్నావే ॥ఎటు ॥ నీవుభద్రాచలనిలయుడ వయ్యారామ- బ్రోవ
వయ్యరామదాసునేలెడిస్వామీ॥ ఎటుబోతివో॥

చ॥ అగణితజన్మజన్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్ । తెగిపడనీద
లేకజగతీధవనీపదభక్తినావచే। వగిలితరింపఁగోరితిపదంపడినాదు భయంబు
దీర్పవే । జిగిబిగిచిక్కులన్నిడక దాశరథీ కరుణాపయోనిధీ॥

వ॥ ఈప్రకారంబున రామదాసు గారు ఆగృహంబునంబడి మొరలిడు
సమయంబున బందీఖానాలేఖకులు పావుశేరుబియ్యమున్న పావుశేరువుప్పు
న్నుకలిపి భత్యముకొలువగా రామదాసుగారు యీఅన్నమునేలాగునభుజిం
పవచ్చును ఓభద్రాద్రినిలయాయని మొరబెట్టుచున్నారు॥

కాంభోజిరాగము- చాపుతాళము,

కటకటనీదుసంకల్పమెట్టిదోగాని - కననెంతవాడ రామా॥ నిటలాక్షుడు
త్రొల్లి నీమాయగనలేక- తటుకుననీవలదగిలెనుగనుకా॥ కట॥ శరణన్న జనముల
బిరబిరబ్రోచేటి - బిరుదుగ్గినదొరనే - ఓరామపరిపరివిధముల మొరలిడవిన
కనన్నరమరచేసితేహరినిన్నేమందు॥ కట ॥ భావజజనకనాభావమెరుంగవే వే
వేగదయజూడవే-దేవాదిదేవాయోదీనశరణ్యానీవేదిక్కునినిక్కముసమ్మితి॥కట॥
గీర్వాణనుతభద్రగిరివాససర్వయోగీశ్వరేశ్వరరామా- సర్వాత్మరామదాస
హృదయాబ్జనిలయా- సర్వాధారపరాకేలబ్రోవను ॥ కటకట॥
త్రోహరా॥ కనుగొనిగోపనకడుదీనుండై కరుణాసాగరరామా.
మనగలనేయీయన్నముదీనియేమార్గమునాకికరామా॥ఇది॥ర్గ॥

జేగడరాగము- ఏకతాళము.

ఏలాగుతాళుదునేమిసేతురామా - ఈజాతిచేతను తాళజాలనురామా॥
ఏ॥దీనజనులకెల్లదిక్కునీవైరామా-మనమునన్నిన్నునేమరువనోరామా॥ ఏ॥ పా
వనమూర్తియోపట్టాభిరామా-కావవేయీవేళకౌసల్యరామా॥ ఏ॥శరణనినీ
చురుగుజేరితినిరామా- శరణంటెకాచేటిబిరుదెరఘురామా॥ఏ॥ఎన్నరానిపేరి
మనెందుదాతురరామా- ఆపన్నరక్షకుడవెనాపాలిశ్రీరామా॥ఏ॥నీసొమ్ము
నేననుటనిజమెవోరామా- నాదోసములన్నియుదొలగించవేరామా॥ ఏ॥ రాతి
కైనాచెమటలరంజిల్లురామా- ఆతీరునీమనసునొందదురామా॥ఏ యమబాధ
బొందగానేలననిరామా-యమదండనలులేకమేడచాపురామా॥ ఏ ॥ వాసిగ
రామకీర్తనజేసితినిరామా-రామదాసునిమీదదయయుంచుమీ రామా॥ఏలాగు॥

వ॥ ఈరీతిని స్తుతియించుతఱి నతండు పచనంబు జేసుకొనిన యన్నంబు దివ్యాన్నంబై యుండె నంతట ప్రతిదినంబున నాలేఖకుల్లాసంగు భత్యంబును పచనంబుచేసి భుజియింపుచున్న బాధితుండై యుండంగొన్ని దినంబులకు తానీష గోపన్న బందిఖానను౦చి బహుదినంబులయ్యెను పైకంబు వసూలుగాక యున్న యది యతండెటుల నున్నవాడో విచారింపుదమని బందిఖానా కాపుదారీ భటులను పిలుపించి యడుగ వారలు ఆగోపన్న కాలద్వయంబుల తమరిచ్చు భత్యంబుచే నేబాధయు లేకరేయుంబవలును రామ౦డనునొకని పేర్కొనియరచుచుండుట గని యెదమింతియకాని పైకంబిచ్చునాలోచన చేయుట లేదనవిని కోపోద్దీపితుండై ప్రత్యహంబును కొరడాలతో కొట్టునటుల నాజ్ఞాపింప నా బందిఖానా కాపుదారులు కొరడాలతో కొట్టుటకు ఆరంభించిన రామదాసుగారు ఆ ప్రయాసకు తాళజాలక రామునింగూర్చి పలవించుచున్నారు॥

ద్విపద॥ రామదాసును భటుల్ రాజసంబునను- సీమలో జనములు చింతిలి చూడ। ముప్పిరి త్రాళ్లను మొనసి రెట్టలకు- తెప్పున దగిలించి తేజంబు దూల। పురములో నిజనంబుల రయక్రిప్పుచును- తరముగాని దురుక్తులు రుభుజనీడ। నంబుల రోష్ఠలనార్భాటములను- యంబోధి మెఱయు చందంబున జేసి- యోరి పాతకుడ నీ యుబ్బణంచెదము వేరు బుద్ధులు మాని వినుము మా పలుకు- గొబ్బున చెల్లించుగో ల్కొండ దస్తు-సబ్బరంబున నుండనీయబ్బసౌన్సు। చెల్లింపకున్న చెచ్చెర గొనిపోయి- విచ్చలవిడిగాను వేధింతుమనుచు మండలేంద్రుని ముఖమంటపంబునకు- దండతాడితు జేయదగు రీతి దెచ్చి- కట్టిరి చేతులు కాళ్లకంబమున- కొట్టిరి కొరడాలకో యనియార్వ- పట్టిమి గానక భాగవతుండు- అట్టె మొరలిడ బూనె హానినిదలంచి॥

అసావేరి రాగము - ఆదితాళము.

అబ్బబ్బా దెబ్బలకు తాళలేరా- రామప్ప గొబ్బున నన్నేలుకోరా॥ అబ్బ॥ మేలు సేయగలేనంటిగదరా- మేలు చేసితి కేమి భయమంటిగదరా- వరహాలు మొహరీలు జమచేస్తిగదరా- నీపరిచారకులకు నేపంచిపెట్టితిగదరా॥ అబ్బ॥ పరులకొక్క కాసుయీలేదుగదరా- ఓ పరాత్మ నీపాదములు నమ్మినారా- కొరడాలు తీసుక కొట్టిరిగదరా- హరినుత గోవింద హరి తాళలేరా॥ అబ్బ॥ ఆత్మలోపలనిన్ను నెరనమ్మినారా- శరణాగత త్రాణబిరుదు లేమాయా- శరధి బంధించిన శౌర్యమెక్కడరా- రాక్షససంహార రక్షించ రారా॥ అబ్బ॥ రామాభద్రాద్రి శ్రీరామరామా నీ- నామము ఎప్పుడు భజియించితి గదరా - రామదాసుని యిటుల చేయుంచితేరా॥ అబ్బబ్బా॥

వ॥ ఈప్రకారంబున శ్రీరాములంగూర్చి పలవించుతరి రాముండు భక్త పరాధీనుండుగావునసాతనిమాహాత్మ్యంబున నాదెబ్బలవలనం గలుగు శ్రమ నివారణంబగుచుండ నొకతరినాభటులు సేయుబాధలందలంచుకొని యిట్టిదు ర్ణయుల యాజ్ఞాబద్ధుడనై యుండునటుల జేసితివిగదా స్వామీయనివిచారింపు చున్నారు॥

ఉ॥ ఎన్నటిదాకనోర్తునిక నెన్నడునాకనుగుణ్యావ య్యెదో। విన్నపమెం త చేసిననువీనులమూసుకయున్న యట్లనీ। వున్నదియేమికారణము యొక్కని మాత్రమునన్ను గావునీ। కన్నదునాకుదిక్కెవరుగల్గుదు రేహరిజానకీపతీ॥

బిలహరిరాగము - రూపకతాళము,

రక్షింపదోరవనినమ్మితీ-నన్ను - శిక్షింపతప్పేమిచేసితీ॥ రక్షిం॥ రక్షిం చమికంటె రాజులెవరున్నారు-దాక్షిణ్యమింతైన తలపునసుంచవు॥ రక్షిం॥ నీ ప్రాపెనెరనమ్మియుంటినీ- నన్ను - కాపాడేబిరుదునీదంటినీ - చేపట్టివిడనాడ జెల్లదుయికనాకు-దాపుదండయుమీరేదైవము సాక్షిగ॥ రక్షిం॥ ఎంతోవేడిన యేలపల్కవు-నే-నెంతద్రోహినాదయజూడవు- యెంతేసివారల నేలేటికర్త వు- అంతకంతకునాపై యరమరజూచేవు॥ రక్షిం॥భద్రాద్రి వాసమీబంటనూ. ఇతర-పాపములేదునావెంటనూ- అద్రిజసన్నుతయమరాదివందిత-భద్రేభ వరదనాపాలిటిదైవము॥రక్షిం॥

ఉ॥ నిన్ననిచాలనమ్మితిని నేటికినాదురవస్థవాయదో। పన్నగతల్పయోజ నకభావమునందయజూచి యాపదల్। అన్నియుఁబారఁదోలి సుఖమందగజే యవెరామచంద్రనీ। కన్నకుమారునింబలెనెగావవెశీఘ్రముజానకీపతీ॥

వరాళిరాగము - ఆదితాళము,

రామనీదయరాదుగా- పతితపావననామమేనీబిరుదుగా - సామజవరద నన్నేమనిధూరుదు-యేమదృష్టమొకానియెంత వేడినరావు॥ రామ॥ ఈవు ఒడుగజాలగా- మీశ్రీపాదసేవమాకుపదివేలుగా- భావజజనకమీభావముదె లిసియునీదైవమనుచు నేనమ్మియున్నాను॥రామ॥నీకేమరులుకొంటిగా- నేని తరులకులోనుగాకయుంటిగా- ఆకొన్నవాడనై యనవలసియుంటిగాని - నీకే దయరాకుంటే నేనేమిసేయువాడ॥ రామ॥ ప్రేమనిబ్బర మాయగా- భద్రా చలధామయిదేమొమాయగా- భూమిజనాయకనాస్వామివీవనుచు- కామిం చిసేవించేరామదాసునిబ్రోవ॥ రామ॥

వ॥ ఇవ్విధంబున దయజూడుమని మొరలిడుచుండం గొన్ని దినంబులకు తర్వాత తానీషమరలగోపన్నపైఁ గసిచెల్లించె నాయనిన్నియుడుగఖజానాజీలేదన నీదినంబుమొదలావిప్రుని ప్రతిదివసంబును నొకొక్కజాము ముండ్లకంపల పై నడిపింపుండని యాజ్ఞాపింపనా రాజభటులు ముండ్లకంపలమీద నడిపించగా నప్పుడు రామదాసు శ్రీరాములం బేర్కొని యిట్లనుచున్నారు॥

ఉ॥ కానలలోనసీవు బహుకష్టములొందుచురాక్షసావలిన్। బూనివధించయోధ్యయనుబొందుగనేలిన యట్టినీక్రియన్। నేనును గ్రామమువ్విడిచి యెక్కడదోచకనున్నవాఁడనో। భానుకులేశ గ్రామమునఁబట్టుగనిల్పవె జానకీపతీ॥

కల్యాణీరాగము - రూపకతాళము,

రామాదయ జూడవే - భద్రాచలధామాననుబ్రోవవే॥ రామాదయ జూచిరక్షించిమము నేలు- రామారణరంగభీమాజగదభి॥ రామా॥ రాజీవదళలోచనా - భక్తపరాధీనా భవమోచనా- రాజరాజకుల రాజరాజార్చిత-రాజితవైభవరాజలలామా॥ రామా॥ తాటకసంహరణా- మేటిరాక్షసకోటిమదహరణా- నీటుతో శ్రీరామకోటివ్రాసిననీకు- సాటిలేరని సారెసారెకు వేడితి॥ రామా॥ దిక్కునీవనినమ్మితీ- నీపాదములమక్కువగని మ్రొక్కితీ- చిక్కులు పెట్టకుచిన్నిభద్రాద్రిలో - గ్రక్కునవెలసినచక్కనిసీతా॥ రామా॥

వ॥ ఈతీరున స్తుతించగా నాబాధనివారణంబగుచుండమరియొకతరితానీషగోపన్నచేతులకుకట్టెకోలలువేసికొట్టుమనగా నప్పుడు శ్రీభద్రాచలనిలయు నిందలంచి రామదాసుగారు యిట్లనిమొరబెట్టుచున్నారు॥

ఉ॥ రామయిదేమిరా నిరపరాధునిదుర్జనులేచుచుండఁగా। నేమియెఱుంగనట్టులసహించుకయున్నవనేమిచెప్పరా। నీమదికింతసహ్యాగుమనేనికనెవ్వరులేరురక్షకుల్। కోమలనీలవర్ణ రఘుకుంజర మద్గతిజానకీపతీ॥

అసావేరిరాగము - చాపుతాళము,

అబ్బబ్బాదెబ్బలకునోర్వలేరా - జబ్బుసేయకరారా తబ్బిబ్బాయెరా- అట్టెనినుపూజించినట్టిచేతులనిదిగో- కిట్టికట్టికొట్టెరెట్టుతాళుదునయ్యా॥ అబ్బ॥ రట్టుదీర్చియీవేళగట్టిగానీవునా- చెట్టబట్టియేలుకోపట్టాభిరామా॥ అబ్బ॥ శరణాగతత్రాణబిరుదాంకుడౌగాదా- శరధిబంధించినశౌర్యమేమాయెరా॥ అ॥ పరంధామనీపాదములయానవినరా- పరులకొక్కకాసునేనివ్వలేదురా॥ అ॥

క॥ తానీషయెక్కనాఁడుజ। వానులఁబిలుపించి షాదివర్తనలడుగన్। మానవనాథద్రవ్యము। తానివ్వగదలపఁడతనిదండింపఁదగున్॥

వ॥ అనియిట్లనేకవిధంబుల విన్నవించి రాజాజ్ఞను బొందినవారై॥

ద్విపద॥ రామదాసుని దెచ్చి రచ్చలో నిల్పి - కోమలంబైన యా కోకలు విప్పి - కట్టి స్తంభంబున గట్టిగా బిగిచి - కొట్టిరి కొరడాల గురుతులు పెట్టి - యేవిరా వరహాలు యేవి మొహరీలు - యేవి రామాడలు యిప్పుడు తెప్పించు - తెప్పించకున్న నీ దేవరతోడు - నొప్పింతుమిప్పుడు నోర్వంగగలవె - వద్దు రా తూకలు వరుసతో నిపుడె - పద్దులు సేయక బాకి చెల్లించు. ప్రొద్దులు పుచ్చకు పోవలె మేము - హద్దులు గట్టక సమర్థిసేయకుము - యికమీద మేము నీకెక్కువ పనులు - పగగొని చేతుము బాగుగా వినుము - అని చేతికొఱడాలనంటించగాను - మసి చేతులెత్తక మొఱలిడదొడగె॥

క॥ గొబ్బున రావే శ్రీహరి। నిబ్బరముగ దాళఁగట్టె యీడ్చి బిగింపన్। దెబ్బలకెట్లోర్తును నే। నబ్బబ్బా తాళజాల నార్తశరణ్యా॥

బిలహరిరాగము - చాపుతాళము,

రావయ్యా భద్రాచల రామా - శ్రీరామ - రమణీయ జవదభి రామ లలామా॥ రా॥ కేవలభక్తివిలసిల్ల గ భావము దెలిపిన దేవుడవైతే॥ రా॥ ప్రొద్దు ప్రొద్దు నని న్నుపొగడుచు నెల్లపుడు - పద్దుమీరగాను భజనజేసెను - గద్దరితనమున ప్రొద్దులు పుచ్చుచు - ముద్దులు గులుకుచు మును పటివలెనిటు॥ రా॥ నన్ను గన్నతండ్రి నా మదిలోననీ - కన్న నితరుల గొలిచేనా - శ్రీకర దివ్య ప్రభాకర కులర - త్నాకర పూర్ణసుధాకర తేజా॥ రా॥ అంజలి సేయనీ వరమరలేని - అడియెనినీ ప్రకటాక్షము పూనీ - ముజ్జగములకును ముదమిపుడు పదముల - గజ్జలు గదలగ ఘల్లు ఘల్లుమన॥ రా॥ దోషము లెంచని దొరవని నీకుదో - సిలియొగ్గితి దొలుత పరాకు - దాసరి తప్పులు దండముతో తీరె - మీసము గలిగినరో సరివైతే॥ రావయ్యా॥

వ॥ మరిన్నేమని కొనియాడుచున్నాడు॥

చ॥ దినకరచంద్ర నేత్రములు దివ్యకిరీటము కుండలంబులు। ఘన నమగు కౌస్తుభంబు నవకాంచన చేలము లక్ష్మి చెంగట। న్దన రెడు నట్టి రూపమును దాసుడు సంతసమందునట్లుగా। ననిశము జూపియా పదలనన్నియు బాపవె జానకీపతీ॥

కల్యాణిరాగము - చాపుతాళము,

ఇన్ని గట్లమీరూరకున్న నేనెవరి వాడనౌదూ॥ కన్నతండ్రివలె రక్షించుటకును కరుణ యేల రాదూ॥ ఇన్ని॥ అక్షయమియ్యగ దలచితె శ్రీమహాలక్ష్మి దేవి లేదా - రక్షించగ దయగలిగితె భూమియు రత్నగర్భగదా॥ ఇన్ని॥ పక్షపాతమె డలించితె చేతులో స్పరశవేది లేదా - ఈక్షణమున దయగలిగితె సంచితధనమున్నది గాదా॥ ఇన్ని॥ కనుగొనినిర్హేతుకకృపజూచితె కల్పతరువు లేదా - మనవాడని నెన

రుంచితెచ్చింతామణియున్నదిగాదా॥ ఇన్ని॥ పెనబడువెతదీర్చనుశరణాగత బిరుదునీదెకాదా- వనజభవాండములేలుదొరలు దేవరవారలెకాదా॥ఇన్ని॥ కరిప్రహ్లాదవిభీషణాదులనుకాచితివనివింటి- హరసురబ్రహ్మాదులకంటేనిను అధికుడవనియంటీ॥ఇన్ని॥సిరినాయకనీమరుగుజొచ్చితిని చేపట్టుమటంటీ-కరుణతోభద్రాచలరామదాసునికావుమయనియంటీ॥ఇన్ని॥

వ॥ ఈవిధంబున భద్రగిరీశునిధ్యానించుచుండనాబాధలు నివారణంబగుచుండరాజభటులురాజాజ్ఞాక్రమంబునమరికొన్నిదినంబులకుఖడ్గంబులపైనడిపింప నుద్యమించినన్నీశ్రమంబునివారించుటకు రాములకంటె నవ్వ్యలులేరనిస్తుతిచేయుచున్నారు॥

చ॥ పరులకుఁజేతికియ్యకనెపంకజలోచననీదుహస్తముల్ । గరివరుమీఁదనుంచికృపఁగాచినరీతినినాశిరంబున। స్థిరవుగహస్తమున్నిలిపియింపుగదండనసేయకేలుకో । నరసఖవాసుదేవసురనాయకమాధవజానకీపతీ॥

పున్నాగవరాళిరాగము - ఆదితాళము.

రామప్రభోనీదయా- నామీదనురాదేమయా- శ్రీరామ ॥ పామరుడను జడుడనుదాసుడను - నేమవర్జితంబగునరపశువనునీమహత్వమెన్న నెంతవాడను-రామరామయనిదలతునిరంజన॥రామ॥ పరులవేడనంటినీపదయుగము లేనమ్మియుంటిని- నన్నరమరసేయవద్దంటిని శ్రీహరిహరియని వేడుకొంటిని-మొరలిడినంతనెకరివరునేలినదొరవనినమ్మితి- నిరసించదగదురమందరగిరిధర త్రిభువనసుందర- యిందిరాసుందరీమనోహర॥ రామ॥ ఏలనాపై కోపము మున్నేమిచేసితినోపాపము- నీలవర్ణనీరూపమునితరముకన్నులజూపుము- మేలొనరించెడిశ్రీలోలుడవనిచాలనమ్మియుంటిజాలముసేయక యేలుకోనుము-గానలోలసురరిపుజాలకాలకరుణాలవాలహరి॥ రామ॥ఈసమయమునను గావరజగదీశజనకసుతావర- చేసితినఘముననుగావర నేనుజేసెదనునీసేవర - ఆసించినశ్రీరామదాసునిటుమోసముచేసినదోసంబెవరిదో - వాసవార్చితాంఘ్రిజలజయుగకైలాసవాసభవ్యభద్రగిరిహరి॥ రామప్రభోనీదయా॥

వ॥ మరిన్నేమనికొనియాడుచున్నారు,

ఉ॥ తాటకనేసితత్తనయుదర్పమణంచియువాలిద్రుంచియు। న్నేటుగ రావణాదులనునేపణగించిననీదుశక్తియు। న్నాటియుదప్పెనేయకట పద్మవిలోచననాదుశత్రుల। నీటునియున్నవారినిడె తెప్పునద్రుంపవెజానకీపతీ॥

## ధన్యాసిరాగము - ఆదితాళము.

ఓరఘువీరాయని నేబిలిచి తేవో హోయనరాదా- సారెకుమరివేసారియ న్యాయము చేరదు నామది యేరాధీరా॥ ఓరఘు॥ నీటబిక్కి కరిమాటకి వేసరినాటుక ధర నీపాటలుపాడగ-మేటిమకరితలమీటికాచుదయయేటికి నాపై నేటికిరాదో॥ఓ॥ మున్నుసభను నాపన్నతసేయగమిమ్ము కృష్ణయని యెన్నగ ద్రౌపది- కెన్నో వలువలిచ్చిమన్ననబ్రోచన వెన్నుడ నామొరవింటివో లేదో॥ ఓరఘు॥ బంటునైతి ననియంటేపారనవుంటివి- జలిసెముక్కంటివినుతనా- జంటబాయకను వెంటరమ్మని వేడుకొంటిభద్రగిరిరామదాసపోషక॥ ఓరఘు॥

వ॥ ఇట్లనేకప్రకారంబుల నాశ్రితబాంధవుండగు రామచంద్రులందలం చుభాగవతుని నడిపించు తరి నాఖడ్గంబులు ధరాతలంబునకు క్రుంగ నాపట రాజభటులుగాంచియాశ్చర్యంబునొంది మరలకారాగృహంబున కుంగొనిచని యేతద్వృత్తాంతంబు తానీష గారికి తెలియంజెప్పి యిటువంటి యుపాయంబెట్లు కోయనినుడివిన॥

తోహరా॥ అనవినియాజ్యాహుతిచే వెలిగెడియగ్నివలెనుమండే-

పెనుగొనివీపునగుండు బెట్టిపురవీధులు ద్రిప్పుచురండీ॥ఇది॥౯౦

అనిఖండితముగ నాడినపల్కులు నాలకించివేగమునా-

అటులసేయుటకు ప్రారంభించిన హరిదాసుడుమరిపెనుపా॥ఇది॥౯౧॥

ద్విపద॥ తడయక జైల్ఖానతలుపులు దెరిచి- జడునై వడి ధరాస్థలిబడియు న్న। బాడబునేకాంతభక్తాగ్రగణ్యు-జాడదెలియగలేకచారులాఘనుని-యిను కుసంకిలులనేపర పాదములను- కరములబంధించి కరుణారహితులు। గ్రక్కు ననుక్కు గుండొక్కటిదెచ్చి-స్రుక్కణంగగ భూసురోత్తముశిఖను-బట్టనేలకు వంచిపదుగురుయెత్తి-పెట్టినవీపున పెనుభారమైన- మోవజాలకఓంనమోరా మయనగ-కావలివారలుఖడ్గముల్వాని- తనయిరుప్రక్కలదరుముచురాగ-ఘ నభారమగుటచేకాళ్లువడకాడ-భూతలాధిపునాజ్ఞపారిపారిభటులా- నీతిదప్పన యట్టికూతలతోడ-గోల్కొండవీధులగొనిత్రిప్పుచుండ- నాల్కయెండగరమా నాథునిమదినితలపోసితలపోసితలయూచియూచివినుతించెనిట్లని ప్రేమశుగూర్చి॥

ఉ॥ దండము రామచంద్ర శరద భ్రవినిర్మలకీర్తిసాంద్రనే। దండధరో గ్రవీరభటదండనకోరువజాలకిఫునే। దండకుజేరినాడంబరదైవము వేడుగంజా లనాగ్రతే। దండశరణ్యనాకభయదానము సంగవెజానకీపతీ॥

ఆనందభైరవిరాగము : ఆదితాళము.

భారములన్నిటికినీవేయనుచు - నిర్భయుడనై యున్నానులే- దారిదప్ప కనీవుదరిజేర్చెదవని, ధైర్యముదోచిందిలే. శ్రీరామ॥భారము ॥ అదిదుష్కృతములు నేనెన్నోచేసితిఅయి తేమకేమాయలే- పతితపావనబిరుదు వహియించినావని ప్రఖ్యాతిగొన్నావులే-శ్రీరామ॥భారము॥ ఏరీతినైన నేనినునమ్మియున్నానునన్నేలుకొనుటకీర్తిలే- నేరుపునేరములెంచిచూచుటకు నేనెంతవాడనులే-శ్రీరామ॥భారము॥మునునిను జేరికృతార్థులైనవారిమచ్చటవిన్నానులే-వినవిననట్లున్నావేమనిపలుమారువిన్నవించనేరలే-శ్రీరామ॥భారము॥శరణన్నవారిరక్షణసేయబిరుదునిశ్చయమైయున్నదిలే- మరిపెముగానన్నిటికినేబట్టిందిమునగకొమ్మగాదులే. శ్రీరామ॥భారము॥బహువిధములనిన్ను బ్రస్తుతించుమని బ్రహ్మవ్రాసినాడులే- విహితజనములలోనేనెవ్వడోయని వేరుజేయబోవులే. శ్రీరామ॥భారము॥ వాసిగభద్రాచలేశుడవనిచాలవర్ణింపుచున్నానులే భాసురముగ రామదాసునేలునట్టిభావము గన్నానులే॥ శ్రీరామ॥ భారము॥

శా॥ అంతఃకదాసుడుహేముదారి యిటునేనా ర్తుండనై మేద్వగో। రంతై నాకరుణింపజూడవయయో రాపాపసంహారశ్రీ। కాంతాయీఘనపాప కర్మములచేగారింపఁగాఁజేయుదే। సంతాపంబు హరింపజేసిననునీ సాన్నిధ్యముంజేర్పవే॥

గీ॥ వాలునమ్మెట్లకోర్చినవజ్రమనఁగ। గాకలకువన్నె కెక్కినకనకమనగ రాహునిహతికిఁదరలనిరాజరంగ। దన్నుసేయించుబాధలందలపడయ్యె॥

వ॥ ఈక్రమంబుననీతాపతినిభజియించు నాభాగవత కులాలంకారుని। శ్రమంబాశ్రితబాంధవుండగు రామునికటాక్షంబుచేసివారితంబగుచుండనొకనాడుతానీషా యితం డెవ్విధంబున కష్టంబులకునోర్చి యుండు వాడో మరి యనుంజూచెదనని యత్యుగ్రుండై నిండువేసవిని యిసుకదిన్నెయలనైనిలుపుండనియాజ్ఞాపింప భటులక్షణంగొనిచనియాలాగుననొనర్ప- నారామచంద్రపాదపద్మారాధకుండగు రామదాసుగారుస్వామినిమేమని వేడుకొనుచున్నారు॥

యమునాకల్యాణిరాగము. ఏకతాళము.

శరణాగతరక్షణబిరుదని శరణంటిగదయ్యా. వెరుపకుమని యభయంబొసగ వెనసుగన్నతండ్రివయ్యా॥ శర ॥ కరివరదుడసిరులొసగను దశరథనందనరావయ్యా- నిరతమునీనామమునాజిహ్వసురుచిగొననియవయ్యా॥ శర ॥ నరహరిబాలునిగాచినజగన్నాథుడవినవయ్యా - గరుడవాహనుడవై నాకన్నుల

గానుపింపవయ్యా॥శర॥ఆదిదేవమిచిత్తముభాగ్యముభారమెవరిదయ్యా-నీదా
సులకును నేదాసుడదయయుంచియేలుమయ్యా॥ శర॥ హరినీతోటిసమానమైన
మాయాప్తులుయెవరయ్యా - కరుణాసాగరుడని మొరలిడినను అరుదేమిటిక
య్యా॥శర॥ కోరితినాపై వమునీవసిదూరితిగదవయ్యా- నేరముటెంచకగారవిం
చికృపజూడుమన్నలనయ్యా॥ శర ॥ ముద్దులుగుల్కగ రామదాసుడనిముచ్చటాడు
మయ్యా- వద్దులయిుండేర్చెడిభద్రాచలపతినీవేగదవయ్యా॥శర॥

వ॥ ఇవ్విధంబున గోవన్న నాశ్రమను సహించి రామకీర్తనంబు జేయు
చుండ నావేసంగి తీక్ష్ణంబతని యొడలనంటదయ్యె నట్టియెడనిది రామానుగ్ర
హంబుగ దాయని మరియును రామునిం దలంచి నృత్యంబుసలుపుచు కీర్తింపు
చున్నారు॥

ఉ॥ రాముడురక్షకుండురఘురామునినమ్మినబంటనేనునా। కేమిభయం
బుచింతలికనేటికియేమిఘటించినన్ రఘు। స్వామిదికీర్తిసత్యమిదిసత్యము నా
కుపనేమటంచునే। నీమహనీయకీర్తివినినిన్ను నునమ్మితిజానకీపతీ॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

రామునివారము- మాకేమివిచారము- స్వామినీదేభారము- దాశరథేనీ
వాధారము॥ రామ॥ తెలిసితెలియనేరము-మా- దేవునిదేవుపకారము-తలచి
నశరీరము- మది- పులకాంకురపూరము॥రామ॥ఘోరాంధకారము-సంసార
మేనిస్సారము - శ్రీరాములయవతారము- మది-జింతించుటేసారము॥రామ॥
యెంతోవిస్తారము- ఆ-వింతలయొయ్యారము - యెంతోశృంగారము- మా-సీ
తేశునియవతారము॥ రామ ॥ ఇతరసేవకోరము- రఘుపతినేనమ్మినారము-అ
తిరాజసులజేరము- మాకేతదేమందారము। రామ॥ ఆమహిమవిన్నారము- భ
ద్రాద్రినికనుగొన్నారము-రామదాసులమైనారము-మదిరంజిల్లుచున్నారము॥
రాముని॥

ధన్యాసిరాగము - ఆదితాళము.

కోదండరాములుమమ్ముగన్నవారు- ధరలో- నాదరించిపెంచివిడనాడలే
రు॥కో॥ మోదముతోగూడుకతమ్మునిజోడు- ఖలులు- బాధించువేళలో నాకుభ
క్తిజోడు॥కో॥సీతారామనామమేమాజిహ్వయందు - యముని- దూతలచార
దోలేటిదొడ్డమందు॥కో॥పట్టాభిరాముల చెయ్యిపట్టినాము - యేము-గట్టిగయ
మునికినామంబెట్టినాము॥కో॥ ప్రేమతోభద్రగిరీశరావదేమి- రామ- దాసుని
రక్షింపవేగరామస్వామి॥కోదండ॥

సీ॥ నిఖిలరోగంబుల నిర్మూలముగఁజేయు భవభయంబుల నెల్ల బాఁ
లు। బంధనంబులఁబటాపంచలుగావించు నోలయు నాపదలను నులిమివైచి దప్ప
త్రవవిజయంబు సతతంబు సమకూర్చుఁ దూలించు బహువిధదుఃఖములను
జూపకుఁడ దుర్దశలను దొలఁగించు సకలశుభంబుల సంగ్రహించుఁ। బరము
వనమంగళప్రదముగానఁ। గలితధర్మార్థకామమోక్షములలోన। నెసఁ
క్తులకొసఁగనిదిల్లేదు। యేమిచెప్పుదు శ్రీరామనామమహిమ॥

గౌళిపంతురాగము - ఆదితాళము.

శ్రీరామ నీనామ మేమిరుచిరా - ఓరామ - నీనామ మెంతరుచిరా॥ శ్రీ॥
కరిరాజప్రహ్లాదతరణిజవిభీషణుల - గాచిననీనామ మేమిరుచిరా॥ శ్రీరా॥
కదళీఖర్జూరఫలములకధికము - పతితపావననామ మేమిరుచిరా॥ శ్రీరామ॥
దధిఘృతమధురసఫలములకధికము - పతితపావననామ మేమిరుచిరా॥ శ్రీరా॥
నవరసపరమాన్ననవనీతములకంటె - నధికమౌనీనామ మేమిరుచిరా॥ శ్రీరా॥
పనసజంబూద్రాక్షఫలరసములకంటె - నధికమౌనీనామ మేమిరుచిరా॥ శ్రీరా॥
అంజనాతనయహృత్పంకజతలమునందు - రంజిల్లునీనామ మేమిరుచిరా॥ శ్రీరా॥
సదాశివుఁడు నిను సదాభజించెడి - సదానందనామ మేమిరుచిరా॥ శ్రీరామనీనా॥
సారములేని సంసారబంధనకుసం - తారకమగునామ మేమిరుచిరా॥ శ్రీరామ॥
శరణన్నజనములసరగున రక్షించు - బిరుదుగల్గిననామ మేమిరుచిరా॥ శ్రీరా॥
తుంబురునారదులుడంబుమీరగ గా - నంబుచేసెడినామ మేమిరుచిరా॥ శ్రీరా॥
అరయభద్రాచల శ్రీరామదాసుని - యేలిననీనామ మేమిరుచిరా॥ శ్రీరామ॥

గీ॥ ఇట్లు ధ్యానంబున రాముని నేకచిత్త। వృత్తిఁ గొల్వఁగ భక్తుని బాధబాపె।
దన్మయంబున నాతఁడు తనువు మఱచి। చిత్రరూపంబుకై వడిఁ జేష్టలుడిగి॥

వ॥ ఈప్రకారంబున రామునియందు మనంబు లీనంబుచేసి తనయత్వం
బునొంది యొండెఱుంగక చిత్రరూపంబుకైవడి నుండిన రామభక్తునింగని యా
భటులతండు నిర్జీవుండయ్యెఁ గాదలంచి గదలించి గోపన్నయని బిలుపగను దప్ప
లండెరచియొప్పటనుండు కింకరులఁ జూచి రామాయనని ప్రాణంబుండు జాల
గాడనితలంచి యతనిం గొనిపోయి బందిఖానాలోనుంచి పరమభద్రంబునగా
పుండసొప్పనాడా గోపన్నయుదయంబున పలుదోముట కొరకు నూతికి నీళ్లు
చేదబోవు సమయంబున నచ్చట నొకవృశ్చికంబ తనిమీటిన నప్పుడాతండు బాధ
నవలసంబరిభ్రమింపుచు స్వామికి తనబాధ నెరుకపరుచుచున్నారు॥

ఆనందభైరవిరాగము - రూపకతాళము,

గాసుపి... సులకు... నచిటికెన వ్రేలూ- ప్రాతఃకాలమందున గుట్టితేలూ॥బాలత్వము మార్గ...విన్నీళ్ల కుపోయి- కాలుపెట్టగచిన్న తేలువాడిచెనయ్యా॥ మే॥చలివచ్చె య్యా...త-దీనివేదనపాపిష్టిఘాత-యీలాగై తేనేనుయేలాగుతాళుదు-మూ చిక్కు...రుమూ గ్తిపాదములాన॥ మే ॥ మిక్కిలిసలుపుచున్నాదీ- దీని గ్రక్కు మయ...ంచేదీ- వెక్కసపెట్టుచు కడతేరనీయదు - మొ్రక్కుదు నాసామినే ...జాలను॥మే॥దరిజూపరాస్వామికేశవా- యిట్లుసరులుచేసినరీతిజేసేవా- చు...లోపలభద్రగిరిరామదాసుని-బడలనీకగాపాడుతండ్రివినీవే॥ మేలైన॥

వ॥ ఈప్రకారంబున వృశ్చికదష్టుండై నను రాముని స్తుతించుచు బాధలం ...దకయుండెడి రామదాసునిజూచి భటులితండుమహానుభావుండని చేరవ చ్చియీయాశ్రమంబునకేలాగున సహించెదవిదిపాపికొనుటకేనై ననుపాయాం తరంబులున్నవాయనిన నతండాభటుల కిట్లనుచున్నారు॥

నాదనామక్రియరాగము - చాపుతాళము.

రామునివారమైనాము - యితరాదులగణనసేయము- ఆమహామహుడు సహాయమైవిభవము-గామమ్ముచేపట్టిగారవించినచాలు॥రాము॥ యమకింకరు ...ంకించేము- పూని- యముడైన ధిక్కరించెదము - అమరేంద్ర విభవము అది యెంతమాత్రము- కమలజునైనలత్యముసేయకున్నాము॥ రాము॥ గ్రహగ ...ులకు వెరవబోము- మాకుగలిగుండుదైవానుగ్రహము - ఇహ పరాదులకు మాకికనెవ్వరడ్డము- మహిరామబ్రహ్మమంత్రము పూనియున్నాము॥రా॥ త్రిభువనదేవదేవుండు- రామతీర్థాలగైవరాయంపు- శుభదాయినైచాలవి భవముగాబ్రోచి-ప్రభుడై రక్షించెడరామదాసులకికను॥రాముని॥

వ॥ కావుననిట్టిప్రభావముగల రామనామంబును సర్వకాల సర్వావస్థల యందు దృఢంబగుభక్తిగలిగి స్తుతిచేయుచు పూజించుచు కీర్తింపుచు నర్తింపు చునుండు దినంబెసుదినంబని యాభటులకెరిగింపుచు భక్తిపరవశుండై యానం దనృత్యంబుసలుపుచుకీర్తనముచేయుచున్నారు॥

సావేరిరాగము - ఆదితాళము,

దినమేసుదినమూ- సీతారామస్మరణేపావనమూ॥ ప్రీతినైన ప్రాణభీతి నైనకలిమి- చేతనైనమిమ్మేతీరుగదలచిన॥దినమే॥ అర్థాపేక్షనుదినమువ్యర్థము ...కుండ- సార్థకముగమిమ్ము ప్రార్థనచేసిన॥దినమే॥నిరతముమెరుగుబంగరుపు ష్పములరఘు-వరునిపాదమ్ముల నమరబూజించిన॥ దినమే ॥ మృదంగతాళము